## సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజీ



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహా ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ





గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి



గురు వివేకానంద



గురు సాయి బాబా



గురు అరబిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళస్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!



ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# కళ — జీవితము



రచన:

ఆచార్య కాకా కాలేల్కర్



అనువాదం:

వేమూరి ఆంజనేయశర్మ



విశ్వసాహిత్య గ్రంథమండలి

= బెజవాడ =

వెల రూపాయి

# తొలి పలుకులు.



సంగీతం, సాహిత్యం, కళ ఈ మూడూ నాగరికత ప్రారంభమైన నాటినుండీ వాడుకలో ఉన్న శబ్దాలే. ఈ మూడు శబ్దాలకూ విశ్వాత్మసమాజంలో బహుళవ్యాపకమైన ప్రచారం ఉన్నది. మనుష్యుడు తనబుద్ధిని ఉపయోగించి సృష్టించే ప్రతి అభిప్రాయాన్నీ, ప్రతి వస్తువునూ పరీక్షించడానికి ఈ మూటిలో ఏదోఒకటి గీటురాయిగా ఉండితీరాలి. ఈ మూడు శబ్దాలూ ఉత్తమవిద్యావంతులూ, విద్వాంసులూ వాడుకొనేవి అయినప్పటికీ వీటిప్రచారం ప్రజాసామాన్యంలో గూడా విరివిగా లేకపోలేదు. ఉత్కృష్టమైన జీవనసిద్ధికోసం ఉపయోగపడే వస్తువుల్లో ఈ మూటికీ ఎంతో గొప్పస్థానం ఉన్నది. ఈ మూడు వస్తువుల చరమసిద్ధినే సత్యం, శివం, సుందరమని మన పెద్దలు పరిగణించారు.

జనసామాన్యంలో ప్రచారమైన ఈ మూడు శబ్దాలూ మనుష్యసమాజంయొక్క అభివృద్ధికీ, సుఖజీవనానికీ, జీవన సంకల్పసిద్ధికీ ఎంతో ఉపయోగపడినవి. కాని సంగీతాన్నీ, సాహిత్యాన్నీ, కళనూ జీవితంతో సమన్వయపరిచి, వాటిని జీవిత సాధనంగా గుర్తించిన మహానీయులు తక్కువనే చెప్పాలి. ఈ మూటినీ సంఘాన్ని సంతోషపెట్టడానికి ఉపయోగపడే పరికరాలనుగా మాత్రమే ఉపయోగించుకొంటున్నాము. ఆత్మానందం కోసం, ఆత్మ సంతృప్తికోసం, ఆత్మోద్ధరణకోసం మనం వాటిని

ఉపయోగించుకొనలేక పోతున్నాము. సంగీతమూ,సాహిత్యమూ- ఉత్తమకోటికి చెంది, మనుష్య జీవితంకోసం ఉపయోగపడే పరికరాలుగా ఉండకపోయినా. అందువల్ల కలిగేహాని అంత ప్రమాదకరమైనది కాదు. కాని, కళకుమాత్రం సక్రమవినియోగం, సదుపయోగం కలగకపోతే ఏర్పడే హాని ప్రశ్నాతీతం. మనం ఉపయోగించేభాషా,మనం ధరించేదుస్తులనూ, మన మనస్సులో నిరంతరం తిరుగాడే ఆలోచనలనూ, మనం చేతులతో, కాళ్ళతో, అంతేకాదు, సమస్తమైన కర్మేంద్రియ, జ్ఞానేంద్రియాలతో చేసే సమస్తకృత్యాలూ కళాన్వితంగా చేసుకోగలిగినప్పుడే జీవితపరమావధిని చేరడానికి సులువు ఏర్పడుతుంది. సురుచి పూర్ణమూ, సుయోగ్యము, కళాపూర్ణమైన పద్ధతులమీద జీవిత రథాన్ని ఆయత్తపరచుకొంటేనే అది సరియైన గమ్యస్థానానికి చేర్చగలదు. లేకుంటే అరథం మధ్యదారిలోనే ఛిన్నాభిన్నం కాక తప్పదు.

సురుచి అనేది కొంత వ్యక్తిగతమైనదీ, కొంత సంఘగతమైనదీకూడాను. సంఘంలో మంచిరుచిని ఏర్పాటు చేసే బాధ్యత కళాకారుని మీదా, కళాకారునిలో మంచి రుచిని ఏర్పాటుచేసే బాధ్యత సంఘంమీదా తప్పకుండా ఉంటుంది. స్వాభావికంగానూ, దైవదత్తంగానూ లభించిన కళాజ్ఞానాన్ని సంఘంయొక్క అభివృద్ధికోసం వినియోగించవలసిన ధర్మం కళాకారునిదైయున్నది.

కళను మనం ఆనందసిద్ధికి ఉపయోగపరుచుకొంటున్నాము. మనస్సులో ఉత్పన్నమయిన ప్రతి యోచనకూ, ప్రతి కోరికకూ ఆకృతిని కల్పించడం; ఆ ఆకృతిని మాటద్వారాగానీ,

చేతద్వారాగానీ, ధ్వనిద్వారాగానీ వ్యక్తంచేసి అనుభవించడం మానవస్వభావం. ఈ స్వభావం జడబుద్ధి, సూక్ష్మబుద్ధి, సుబుద్ధి కలిగిన ముగ్గురిలోనూ ఒకేరీతిగా ఉంటుంది. ఈ మూడు తరగతుల జనులు ఉన్నంతకాలమూ కళద్వారా ఆనందం పొందడానికి వేరువేరు ప్రయత్నాలుజరుగుతూనే ఉంటవి. కాని సుబుద్ధి కలిగిన వ్యక్తి కళను చేయూతగా తీసుకొని ఆత్మానంద ప్రాప్తికి చేసిన సఫల ప్రయత్నమే కళయొక్క ఉత్తమ ప్రయోజనం. ఇంద్రియ ప్రకోపాన్ని కలిగించని హృదయ ప్రవృత్తుల నన్నిటినీ, శాంతి, ఆనందములవైపుకు అహింసాపద్ధతులద్వారా నడిపించే ప్రతిసాధనంలోనూ కళ ఉన్నది. కాని, మన సంస్కారాలూ, తజ్జనితమైన కోరికలూ, తత్ఫలితంగా ఏర్పడే మన చేతలూ వ్యక్తిగతదోషంవల్లగానీ, సంఘజనిత ప్రభావం వల్ల గానీ ఉత్తమమైనవి కాకపోవడంచేత మనం కళారాధకులం కావడానికి ప్రయత్నం చేసినప్పటికీ జీవితచరమలక్ష్యంవైపుకు కళ మనలను తీసుకొని పోలేకపోతున్నది. అందువల్లనే కళకూ జీవితానికీ సంబంధం లేదనీ, కళ కళకోసమే అనీ, అంతస్సుఖం కోసమే కళ అనీ, కళ అనుభూతికి లోబడేదే గాని చక్షుర్గతం గానీ శ్రవణగతం గానీ కాదనీ, హృదయాన్ని ప్లావితంచేసి దుఃఖాన్ని మరిచిపోవడానికి ఉపయోగపడే సాధనమే కళ అనీ, క్షణికంగా గానీ, శాశ్వతంగా గానీ సంకల్పసిద్ధికోసం ఈశ్వర సాన్నిధ్యం కోసం ఉపయోగపడే పరికరమే కళ అనీ, కళను మనం ఎన్నెన్నో నిర్వచనాలు చెప్పుకుంటున్నాము. నీతి, సదాచారము, ఈశ్వరచింతన, న్యాయము, ధర్మము అన్నీ ఏవిధంగా జీవితచరమలక్ష్యప్రాప్తికి దారులో ఆదేవిధంగా,

కళ కూడా ఒక రాజమార్గ మనీ, ఆ దారుల నన్నిటినీ, సుఖ కరంగానూ, ఆనందకరంగానూ, కంటకహీనంగానూ చేయు డానికి ఉపయోగపడే వస్తువే కళ అనీ శ్రీ కాకాసాహెబ్ కాలేల్కరుగారు ఈ పుస్తకంలో నిరూపించడానికి ప్రయత్నం చేశారు.

శ్రీ కాకా సాహెబ్ ఎన్నో సంవత్సరాలుగా సన్న్యాసాన్ని స్వీకరించిన పరివ్రాజకుడు. కాని, గొప్ప రసపిపాసి. నిరాడంబరమైన దుస్తులను ధరించి అతి సామాన్యంగా చరించే వ్యక్తి. కాని, తన ఆచరణశుద్ధిలో అసామాన్యుడు. గొప్ప విద్వాంసుడు. వ్రాయసకాడు. వేలకొలది పేజీలు గుజరాతీలోనూ, మరాఠీలోనూ, హిందుస్తానీలోనూ వ్రాశాడు. ఆయన వ్రాతల్లో అశ్లీల భావాలు గానీ, లోలుపత్వంగానీ, దోషభూయిష్ఠమైన రసపిపాస గానీ కనబడదు. ఆయన వ్రాత నంతా గద్యకావ్యాలుగా పరిగణించవచ్చును. గంటలకొలదీ సంగీతాన్ని వినగలడు. ఎన్నోగంటలసేపు రాతిమీది రేఖలనూ, కాగితంమీది గీతలనూ, మైమరచి చూసి ఆనందించగలడు. కావ్యాత్మకమైన భాషనూ, రసనిక్తమైన కావ్యాన్నీ, రసోన్మాదంతో కూడిన పద్యాన్నీ, కన్నులకు మిరుమిట్లు గొలిపే శిల్పాన్నీ, హృదయాన్ని చూరగొనే ప్రకృతి శోభనూ చూసి ఆయన ఎంతగా ఆనందిస్తాడో, భూమిమీద దోగాడేశిశువునూ, తిండీ, గుడ్డ లేక అల్లాడే నిరుపేదనూ, అజ్ఞానుడైన విద్యార్థినీ, మహాజ్ఞానియైన మేధావినీ చూసిగూడా అంతే ఆనందిస్తాడు. జీవితాన్నీ జ్ఞానాన్నీ, బుద్ధినీ హృదయాన్నీ, శక్తినీ సంకల్పాన్నీ, సత్యా హింసనూ, కళనూ ఆనందాన్నీ సాక్షా

త్యాన్నీ సంగీతాన్నీ జీవితపరంగా సమన్వయపరచి సంఘానికి సమర్పించడం కోసం ఆయన ముప్పయి సంవత్సరాలనుండీ సాధన చేస్తూ వచ్చాడు. ఆ సాధనఫలితంగా ఆయన సృష్టించిన సాహిత్యంలో "కళా-ఏక్ జీవన్ దర్శన్" అనే పుస్తకం ఒకటి. (దీనికి మాతృక గుజరాతీ). దీనిని నామిత్రుడు శ్రీ ఆంజనేయశర్మ గారు తెలుగులోనికి అనువదించి కాకాసాహెబ్ భావాలను తెలుగువారికి పరిచయం చేశారు. ఈ పుస్తకం కాకాసాహెబ్ సాహిత్యారాధనతోనూ, కళోపాసనతోనూ, ఆయన నిరంతర జీవనసంఘర్షణతోనూ పరిచయం కలగడానికి మొదటిమెట్టుగా ఉపయోగపడుతుం దని నమ్ముతున్నాను.

గాంధి నివాస్,<br>హిందీ ప్రచారసభ<br>మద్రాసు.<br>15-3-46.

మోటూరి సత్యనారాయణ

# పరిచయం



ఆచార్య కాకా కాలేల్కరు 1885 సంవత్సరం డిశెంబరు 1వ తేదీన మహారాష్ట్ర దేశంలోని సతారాలో జన్మించాడు. సరిగ్గా ఆ సంవత్సరం ఆ నెలలోనే అఖిలభారత కాంగ్రెసు సంస్థ ఏర్పడడం, ఆ సంస్థకూ, కాకాజీకీ అవినాభావ సంబంధం కలగడం, గమనించదగిన విషయమే. తండ్రి ప్రభుత్వోద్యోగి కావడం వల్ల కాకాజీకి బాల్యంలో తన తండ్రితో పాటుగా దేశ పర్యటనం చేసే సౌభాగ్యం సంప్రాప్తించింది. ఆ రోజుల్లో పర్యటనం చేయడం అంటే చాలా భయంకరంగా ఉండేది. కుటుంబంతో ఎద్దుబండిమీద బయలుదేరడం, ఏ అడవిలోనో ఏ చెరువు గట్టుమీదనో వంట చేసుకొని భుజించడం, ఏ చెట్టు క్రిందనో విశ్రమించడం ఆనాటి పర్యటన కార్యక్రమం. అడవిలో క్రూరజంతువుల భయం ఉండనే ఉండేది. పైన దొంగల బాధగూడా విపరీతంగా ఉండేది. అటువంటి కావ్యమయజీవితంలో కాలేల్కర్ గారి బాల్యజీవితం ఆనందంగా గడిచింది. అస్తమానం మహారాష్ట్రంలోనూ, కర్ణాటకప్రాంతంలోనూ, స్వదేశసంస్థానాలలోనూ తండ్రితో పాటు తిరుగుతూ ఉండడం వల్ల ఆయన నియమబద్ధంగా ఏ పాఠశాలలోనూ చదువుకోలేదు. అందుకు ఆయన తన సంతోషాన్ని వెలిబుచ్చుతూ ఉంటాడు. తల్లిదండ్రుల ఒత్తిడీ, ఉపాధ్యాయులబాధా పడలేక మెట్రిక్ పరీక్ష పూర్తి చేసి పూనాలోని ఫర్గ్యుసన్ కాలేజీలో ప్రవేశించాడు.

డు. గణితశాస్త్రమన్నా, భాషాశాస్త్రమన్నా ఆయనకు చాలా అభిమానం. సైన్స్ అన్నా ఇష్టమే. కుటుంబం ధార్మికమైన సనాతన సంప్రదాయానికి చెందింది కావడంవల్ల బ్రాహ్మణ సంస్కృతి ఆయనలో జీర్ణించి ఉండిపోయింది. ఆయన సృష్టించే సాహిత్యంలో ఈనాటికీ ఆ సంస్కృతి తాలూకు ఛాయలు కనిపిస్తూనే ఉంటవి.

కాలేజీలో ఉండే రోజుల్లో వివేకానంద, రామతీర్థుల గ్రంథాలను చదివి రామతీర్థ గ్రంథాలను మరాఠీలోనికి అనువదించారు.

ఇంతలో దేశంలో వంగవిభజనాందోళన రావడం, కాకాజీ ఆ ఆందోళన సందర్భంలో దౌర్జన్యయుతమైన విప్లవం కావలె ననే వర్గంలో చేరడం జరిగింది. అరవిందఘోషు, బ్రహ్మబంధు ఉపాధ్యాయుల సంపర్కంలోనికి వచ్చిన తరువాత ఆయన జీవితంలో కలిగిన మార్పులూ, ఆయన చేసిన పనులూ అజ్ఞాతంగానే ఉండడం మంచిది.

తరువాత కాకాజీ దేశంలో నవజాగృతిని కలగజేయడానికి జాతీయ విద్యాప్రచారం అవసరమని నిర్ణయించుకొని బెల్గాంలో జాతీయ విద్యాలయాన్ని ప్రారంభించారు. కాని, విద్యాలయ పాలక వర్గానికీ, ఆయనకూ భావాలు కలవనందువల్ల, విద్యాలయాన్ని వదిలిపెట్టి బొంబాయిలోని దినపత్రిక "రాష్ట్రమత్" సంపాదకవర్గంలో చేరారు. లోకమాన్య బాలగంగాధర తిలక్‌కు ఆరు సంవత్సరాల శిక్ష విధింప బడిన తరువాత జాక్సన్ వధ్ధరు

కేసు సందర్భంలో "రాష్ట్రమత్" పత్రిక ప్రభుత్వంవారి దమన నీతికి స్వాహా అయిపోయింది.

తరువాత కాకాజీ శ్రీ కేశవరావు దేశపాండేగారిచేత ఆహూతుడై బడోదా రాష్ట్రీయ విద్యాలయంలో చేరాడు. కాని ఆ విద్యాలయంగూడా, ఢిల్లీ దర్బారు సందర్భంలో ప్రభుత్వం వారికి, బడోదా నరేశునిమీద వచ్చిన కోపాగ్నికి ఆహూతి అయిపోయింది. సంస్థలు ప్రారంభించడం, అవి సరిగ్గా నడవకపోవడంవల్ల కాకాజీకి విరక్తి కలిగింది.

ఆధ్యాత్మికశక్తిని సంపాదిద్దా మనుకొన్నాడు. హిమాలయానికి వెళ్లిపోయినాడు. గంగోత్రినీ, యమునోత్రినీ, కేదార్‌నాథ్ బదరీనాథులనూ, కాశ్మీరంలోని అమరనాథునీ, నేపాళంలోని పశుపతినాథునీ సందర్శిస్తూ రెండువేల ఐదువందలమైళ్లు కాలినడకను సంచారం చేశాడు. ఈ యాత్రా సమయంలో ప్రకృతితో తాదాత్మ్యభావాన్ని పొందడానికి ఎంతో సాధన చేశాడు. కాని, భారతదేశ స్వాతంత్ర్య సంగ్రామాన్ని మరచి పోలేక పోయినాడు. దేశమాత ఋణం తీర్చుకొంటేనేగాని ఆయనకు ఆధ్యాత్మిక శక్తి సంపాదనలో ఆనందం కనపడలేదు.

తిరిగి జాతీయ విద్యాప్రచారం వైపుకు మొగ్గాడు. రవీంద్రనాథుని శాంతి నికేతనంలో ఉపాధ్యాయుడైనాడు.

ఆ రోజుల్లో దీనబంధు ఆండ్రూసుతోగూడా గాంధి మహాత్ముని ఆశ్రమవాసులు కొంతమంది శాంతినికేతనంలో ఉండడంసంభవించింది. వారితో కాకాజీకి పరిచయం ఏర్పడింది.

అది మొదలు ఆయనకు గాంధీజీ సిద్ధాంతాలు నచ్చడం ప్రారంభించినవి. గాంధీజీతో ఆయనకు సంపర్కం కూడా ఏర్పడింది.

కేశవరావు పాండేగారి అనురోధంవల్ల కాకాజీ శాంతినికేతనాన్ని వదలిపెట్టి బరోడాలో పాండేగారు ప్రారంభించిన గ్రామసేవా కార్యంలో పాల్గొన్నాడు. కాని గాంధీజీ పాండేజీతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి కాకాజీని తన ఆశ్రమానికి పిలిపించుకొన్నాడు. తదాదిగా గాంధీజీ కార్యక్రమంతో కాకాజీకి సన్నిహిత సంబంధం ఏర్పడింది. కొద్దిరోజులు ఆశ్రమంలో ఉపాధ్యాయుడుగా పనిచేసి ఆ తరువాత గుజరాత్ విద్యాపీఠ్‌కు ప్రధానాచార్యుడైనాడు. నవజీవన పత్రికకు గుజరాతీలో వ్యాసాలు వ్రాయడ మారంభించాడు. ఈనాడు గుజరాతీ సాహిత్యంలో కాకా కాలేల్కర్ ఒక శైలీకారుడుగా పరిగణింపబడుతూ ఉన్నాడు.

గడచిన పది సంవత్సరాలనుండీ జాతీయభాష అయిన హిందూస్థానీ ప్రచారానికి ఆయన చేస్తున్నకృషి ప్రశంసనీయం. భారతీయ సాహిత్య పరిషత్తుకు కార్యదర్శిగాఉండి అద్భుతంగా పనిచేశాడు.

ఆయన ఇంతవరకూ శాస్త్రీయ గ్రంథాన్ని దేనినీ వ్రాయలేదు. కాని వ్యాసరూపంలో ఆయన గుజరాతీలో వ్రాసిన సాహిత్యం అనుపమానం.

42 ఉద్యమంలో జైలుకుపోయినప్పుడు కాకా కన్నడ భాషనుగూడా నేర్చుకొన్నాడు.

# కళ - జీవితము



నేను కళోపాసకుణ్ణి. నా జీవితంలో కళకు ఉన్న స్థానం చాలా గొప్పది. నా జీవితనిర్మాణంలో కళ తక్కువ ఉపకారం చేసి ఉండలేదు. అయినా నేను కళను గురించి శాస్త్రీయంగా ఆలోచించలేదు. కళకు సంబంధించిన ఇతిహాసాన్వేషణంలోనికి దిగలేదు. కళకు సంబంధించిన పురాతనసాంప్రదాయాలను గానీ, ఆధునిక సాంప్రదాయాలనుగానీ అనుసరించలేదు. కళా కారులకు ఆశ్రయమైనా ఇవ్వలేదు. లేక కళారసికులు ప్రశం సించి పీపుల్ తట్టేటట్టుగా చిత్రాల నైనా వ్రాయలేదు. స్వర్గీయు లైన శంకరరావుపాఠక్, శంకరరావుఖరే, వ్యాస్ మొదలైన సంగీతాచార్యుల సంగీతరసంలో సంవత్సరాలకొలది ఆకంఠం మునిగివున్నా, ఇప్పటికీ ఏ రాగాన్నీ ధైర్యంగా గుర్తించలేను. వేరువేరు కళాకృతులను పోగుచేసి గదిని అలంకరించుకొనే పద్ధతిఅయినా నాకు తెలియదు, జీవితం అంతా అటుఇటు తిరుగుతూ ఉండే తిరుగుబోతుగాళ్ళల్లో నేను ఒకణ్ణి. కాని ప్రకృతి అంటే నాకు సిచ్చిఅని చెప్పుకోవడానికి ఏమాత్రం సందేహిం చను. పెద్ద పెద్ద పట్టణాలు, బ్రహ్మాండమైన భవనాలు నా కొరకుకాదు. నేను గుడ్డలు కట్టుకునేది ఎండినకర్రలాంటి బలహీన మైన శరీరాన్ని చూపించి జనానికి ఏవగింపు కలగకుండా చేసికోడానికే నని మనవి చేస్తున్నాను. కాకపోతే నాజీవిత కులాయం, పర్వతపుఅడవుల్లోనో, సముద్రపు ఇసుకమీదనో,

నదులతీరాలలోనో, నిబిడమైన వృక్షచ్ఛాయలలోనో నిర్మించబడి ఉండవలసింది. అపరిచితుడైన వ్యక్తితో సంభాషించడం అంటే నాకు ఎంతో సంకోచం.

మనుష్యుడు అంటే నాకు అసహ్యం లేదు. మానవుల్ని నేను ప్రేమిస్తాను. మానవుని పురుషార్థాలు, అతను తయారుచేసే ప్రణాళికలు, అతనిపొరపాట్లు, ఆ పొరపాట్లను దిద్దడానికి చేసే ప్రయత్నాలు, అతనికోరికలు, సందేశాలు, అతనిప్రేమ, బలిదానము ప్రతిదానివైపుకు నాహృదయం ఉత్సాహంతో పరుగెత్తుతూ ఉంటుంది. మానవసమాజ మన్నా మానవసంస్కృతి అన్నా నాకు ఎక్కువభక్తి. ఈ విశాలవిశ్వం లాంటి మానవుని హృదయాన్ని, అతని సంస్కృతిగాంభీర్యాన్నీ చూసి నేను ఆశ్చర్యపడతాను. ప్రపంచం వన్ను అతనికి దూరంచేసినా, నేను అతని సాంగత్యాన్ని అన్వేషిస్తాను. ఎంత ఆనందంతో నేను వృక్షాలను, పర్వతాలను చూస్తానో అంత ఆనందంతో రాజప్రాసాదాలను, కుటీరాలనుగూడా చూస్తాను. శరీరం అంటే లక్ష్యం లేకుండా అడవుల్లో ఏవిధంగా తిరిగానో, సభలలోను, యాత్రలలోను అదేవిధంగా పాల్గొన్నాను. నాకుసూర్యోదయాన్ని,సూర్యాస్తమయాన్ని, మధ్యాహ్నాన్ని చూసినప్పుడు కలిగినఆనందం, రవిభాయి, కనూభాయి సోమలాల్‌షా ప్రాసిన కళాకృతులను చూచినప్పుడుగూడా కలిగింది. ప్రపంచంలో అనేకరూపాలతో విచరిస్తూ, విహరిస్తూ, వికసిస్తూ ఉన్న కళను గుర్తించడానికి ఎన్నిచోట్లకు నేను తిరగవలసివచ్చిందో, కల్పనద్వారా అన్నిచోట్లకు పాఠకులనుగూడా త్రిప్పగలిగినట్లయితే నా మనసు పూర్తి అయిన

దని భావిస్తాను. భూమిలోని రత్నాలను, సముద్రంలోని ముత్యాలను, వృక్షాలలోని పూలను, ఆకాశంలోని పక్షులను, అంతరిక్షంలోని అగణితమైన తారాగణాన్ని, కవుల కల్పనలను చూసి, కళాకారులు నిర్మించిన సుందరములు, భవ్యములు అయిన పురాతన, ఆధునిక కృతులలోని రసాన్ని ఆస్వాదించి, నేను ఎవరెవరిదగ్గర కళాదీక్షాదీక్షితుడనైనానో చెప్పితే, కళా క్షేత్రంయొక్క శక్తి ఎంత వ్యాపకమైనదో కళ ఎంతప్రధాన మైనదో పాఠకులకు కొంతవరకు అందనాగా తెలియజేయ గలుగుతాను.

ఇంతవరకు కళనుగురించి ఎంతోమంది మాట్లాడారు. వ్యాసాలు వ్రాశారు. చర్చలు చేశారు. వాదవివాద సభ లను, ప్రదర్శనాలను ఏర్పాటుచేశారు. సమయం దొరికినప్పు డల్లా కళాకోవిదులు కళాపిపాసకులకు మార్గముంచు పెట్టారు. మానవసమాజానికి కళామహాత్మ్యాన్ని తెలియజెప్పారు.



# 2

## సాహిత్యం, సంగీతం, కళ.

చీరయొక్క అందానికి గోటు, అంచులు అవసరమైనట్లు జీవితానందానికి సాహిత్యము, సంగీతము, కళ అవసరమనే విశ్వాసం ప్రజాహృదయాలలో బాగా నాటుకొని పోతున్నది. గోటు, అంచులు లేకపోతే చీర తయారేకాదు; ఉండదు

అనికాదు. గోటు ఉండడంవల్ల చీర చీరగా కనబడుతుంది. అదేవిధంగా సంగీతము, సాహిత్యము, కళ లేకపోయినా మనం జీవించగలం. కాని, ఆ జీవితాన్ని ఒక జీవితం అనడానికి వీలుండదు. అంచు, గోటు, చీరలో ఒక అందమైన భాగం; అంతేకాని చీరలోని ముఖ్యభాగం మాత్రంకాదు. ఒట్టి గోటును కప్పుకోరు; ధరించరు. చీరలో అది ఒక భాగంగా ఉన్నప్పుడే దానిశోభ.

ఇది సామాన్య విషయం. ఒకవస్తువు మహత్వాన్ని అంగీకరించవలె నన్నా, ఆ వస్తువునుగురించి సంపూర్ణంలో పరిచాలము చేయవలె నన్నా, దానిని కేంద్రంలో బెట్టి మిగిలిన యావత్తుసృష్టినీ ఆవస్తువునకు నలువైపులా తిప్పితేనేగాని మనకు శాంతి కలుగదు. మనం భూమిమీద నివసిస్తున్నాం. అందువల్ల భూమిని గ్రహాలకూ, నక్షత్రాలకూ మధ్యబిందువుగా జేసి ఒక రకమైన జ్యోతిశ్శాస్త్రాన్ని నిర్మించుకొన్నాము. మనకు మన వ్యక్తిత్వం అంటే చాలా ఇష్టం; అభిమానం. అందువల్ల ఈ సృష్టిఅంతా మన అహంకారప్రవృత్తిని పోషిస్తుంది అని సిద్ధాంతీకరించుకొన్నాము. యూరపులోని ఇద్దరుముగ్గురు రాజులు ఈ అహంకార ప్రవృత్తివల్ల నే ప్రేరితులై 'I am the State' అన్నారు. ఈ అహంకార ప్రవృత్తి సత్యరూపుడైన సూర్యభగవానునిముందు నిలవ గలదా? మానవజీవితానికి శృంగారంగా ఉన్ననాడే కళకు సాఫల్యం; శోభకూడాను.

సంగీతము, సాహిత్యము, కళ— ఈ మూడూ ఒకదానికొకటి నెచ్చెలులు; మూడూ ఒకే పరివారానికి సంబంధించినవి.

వీని పరస్పరసహయోగం వల్లనే జీవితం రమణీయము, సరి సుళవంతము అవుతుంది. కాని ఈ మూడు, తమతమ ప్రత్యేకప్రాధాన్యాన్ని చూపించవలెనని గూడా ప్రయత్నం చేస్తూఉంటవి. కాని అవి ఆ ప్రయత్నంలో సాఫల్యాన్ని పొందలేక పోతున్నవి. నేను ఒక సంగీతాన్ని మాత్రమే ఉపాసిస్తాను, నాదబ్రహ్మమే నన్ను మోక్షానికి తీసుకొని పోతుంది, అనే భావంతో అనేకమంది గాయనాచార్యులు అనన్య భక్తితో సంగీతాన్ని ఉపాసించారు. పూర్వకాలపు గానశాస్త్ర వేత్తలు తమవద్ద నిష్ఠతోబాటు, అలౌకికమైన జీవితవిభూతి గూడా ఉండడంవల్ల సంగీతంద్వారా తమజీవితాన్ని ఉన్నతపథాలలోనికి తీసుకొనిపోగలిగారు. వారి అనుయాయులు జీవితంలోని ఒక అంగాన్ని వికసింపజేయటానికి పూర్తిజీవితాన్ని వికసింపజేయవలసి ఉంటుంది అనే విషయాన్ని తెలుసుకోలేకపోయినారు. సంపూర్ణజీవన వికాసానికి దోహదం చేయకపోవడంవల్ల వారి జీవితం శుష్కమయిపోయింది. కేవలం పాటమాత్రం వచ్చిన అనేకమంది సంగీతకళావిశారదుల్ని చూచాను. వారు సంగీతంలో నిధులే కావచ్చును. కాని వారిలో నాగరికత, శిష్టత అనేది నాకు మచ్చునకైనా కనబడలేదు. వారి ఉచ్ఛృంఖలమైన జీవితాన్ని చూచినప్పుడు వీరికి ఈ సంగీతం ఏవిధంగా అబ్బిందా అని సందేహం కలుగుతుంది. వారికి సాహిత్యం అంటే ఏమిటో అసలే తెలియదు. ఏమిటో పాడతారు! చిత్రకారుల విషయంలోగూడా బహుభాగం ఇదే చెప్పవచ్చును.

సాహిత్యం విషయం వేరు. ప్రపంచంలో సాహిత్యం ధర్మబోధనకు సాధనరూపంగా వికసించింది. కేవలం "సాహిత్యం సాహిత్యానికే" అని భావించడం ఆరంభిస్తే సాహిత్యం కూడా ఒక దర్శనశాస్త్రం అవుతుంది. సాహిత్య ధురంధరులంతా శిల్పకారుల, సంగీతాచార్యుల శ్రేణిలో చేరిపోతారు.

సంగీతానికీ, కళకూ స్వతంత్రమైన, సంపూర్ణమైన ఫిలాసఫీ ఉండవచ్చును. కాని సాహిత్యవిషయం అటువంటిది కాదు. అందువల్ల సాహిత్యం తన గొప్పతనాన్ని గుర్తించుకొని సంగీతాన్నీ, కళనూ తనతో బాటుగా నడిపించుకొంటూ పోయి సంపూర్ణమైన వికాసావస్థను పొందినప్పుడు మాత్రమే ఆ రెండింటినీ-సంగీతాన్నీ, కళనూ-స్వతంత్రంగా వదలవచ్చును. వదలటం అంటే వాటితో సంబంధం లేకుండా చేయడం కాదు. విదియపండుగనాడు అక్క-చెల్లెళ్ళు కలుసుకొన్నట్లుగా సాహిత్యము, సంగీతము, కళ-యీ మూడు ఉత్సవసమయాలల్లో ఒక ఇంట్లో కలుసుకోవాలి. అది అవసరం. స్వాభావికం కూడాను.

ఆ కారణంవల్లనే సాహిత్యపరిషత్తులలో సంగీత మంగళాచరణాలకు, కళాప్రదర్శనాలకు ఏర్పాట్లు జరుగుతున్నవి. అప్పుడప్పుడు సంగీతసమ్మేళనాలు కూడా వేరుగా జరుగుతూఉన్నవి; జరగవలసిందే. కళాపరిషత్తులు మాత్రం వేరుగా ఎక్కడా జరుగుతూ ఉన్నట్లు కనబడదు. కళాప్రదర్శనాలు జరుగుతునేఉన్నవి. ఆ ప్రదర్శనాల సమయంలో గొప్ప గొప్ప ఉపన్యాసాలు ఇవ్వబడుతున్నా, వ్యాసాలు చదవబడుతున్నా వాటిని పరిషత్తులని పిలవడానికి అవకాశం లేదు.

సంఘ శ్రేయోభిలాషులు, నాయకులు సామాజిక జీవనవికా సానికిగాను సాహిత్యాభివృద్ధికి తోడ్పడాలి. సాహిత్యసహా యంతో సంగీతానికీ, కళకూ, రెంటికీ సర్వతోముఖమైన వికా సాన్ని కలుగజేయాలి. ఈనాడు సంగీత శాస్త్రజ్ఞులు చేస్తున్న తపస్సు, చూపించే ఏకాగ్రత, జాగృతి అభివందనీయాలు. వారు పురాతనమైన దానిని సంస్కరించుకొంటూ, నూతన మైన అనుసంధానాలను చేస్తూ, నూతన సంఘాలను స్థాపించు కొన్నారు. పాతకాలపు గ్రంథాలను అర్థంచేసుకొనేటందుకు ప్రయ త్నం చేస్తున్నారు. దేశదేశాంతరాలలో తమ సంగీతమహా త్వాన్ని చాటడానికి ప్రయత్నం చేస్తున్నారు. కాని వారు తమలో జీవితదీక్ష లేకపోవడంవల్ల తమ రెక్కలను జీవితా కాశంలో దూరం వరకు ఎగరడానికి ఉపయోగించలేకపోతు న్నారు. వివేకానందుడు, తన జీవితంలో దీక్షే గనుక లేకపోయి నట్లయితే కేవలం సన్యాసం, వేదాంతం రెండింటి వల్లనే పశ్చిమ దేశంలో అంత జాగృతిని కలగజేయగలిగేవాడు గాడు. వివే కానందుడు సన్యాసము వేదాంతము, కొరకై పనిని చేశాడో జీవితదీక్షా దీక్షుతుడైన వ్యక్తి సంగీతం కొరకు ఆ పనినే చేయాలి. దిలీప్ కుమార్ రాయ్ లాంటివారు సంగీతశాస్త్రానికి చేసిన సేవ కొద్దిదే అయినప్పటికీ వారి సేవాప్రభావం ఇతరుల మీద అంతమొత్తంగా పడడానికి కారణం వారిలో ఉన్న వ్యాపకసంస్కారభావమే.

శిల్పకళ, చిత్రకళల విషయంలో గూడా అంతే నని చెప్పడానికి సాహసిస్తున్నాను. ఇది వింటే చాలామంది కళా కారులకు నామీద కోపం వస్తుందనుకొంటాను. సుప్రసిద్ధ

కళాకారు లని ప్రఖ్యాతిగన్న వారి జీవితాన్ని ఒకసారి చూడ మని కోపగించే వారందరికీ నామనవి. వారు మహాత్ములు కాక పోవచ్చును, తపశ్శాలురు కాకపోవచ్చును, సర్వసంగ పరిత్యాగులై సన్యాసాశ్రమాన్ని స్వీకరించక పోవచ్చును, కాని వారిలో ఏకాగ్రత, తీవ్రభావాతిరేకము, కోమలభావస్ఫూర్తి, చేస్తున్న పనిలో ఆత్మార్పణం చేయవలె ననే భావం ఉండాలి. వారి జీవితాలలో సర్వాంగీణ మైన సంస్కారదీక్ష ఉన్నట్లయితే వారు కళను జీవితసామ్రాజ్య సింహాసనం మీద అధిరోహింప జేయగలుగుతారు.

ధర్మభావప్రేరితులై, సంఘక్షేమకాములై, జ్ఞానా ర్జన, సంఘసేవలలో మగ్నులం కావలె ననే కోరికగలవారై ఉన్నంతకాలము సాహిత్యకారులు సంఘాన్ని నడిపించగలిగారు, శాసించగలిగారు. నేటికీ కొంతమంది సంఘాన్ని ముందుకు నడిపిస్తున్నారు. జీవితతీవ్రత ఉన్నచోట సాహిత్యశక్తి తా నంతట తానే ఉద్భూతమై ప్రవహించి తీరుతుంది.

జీవనదృష్టితోబాటు సత్సంప్రదాయము ననుసరిస్తూ, సంకుచిత సంప్రదాయాలనుండి వైదొలగి ఉన్నంత కాలమూ సాహిత్యము ఉన్నతస్థానంలో ఉంటుంది. సాహిత్యము అహం, ప్రేమలో మునిగిపోయి 'సాహిత్యం సాహిత్యానికే' అనే ఆద ర్శాన్ని ఏర్పాటుచేసుకొంటే, విలాసంలోనే తన సార్థకతను చూడడం ఆరంభిస్తే ఆ రోజునే తనకున్న గౌరవస్థానాన్నీ, మహాత్మ్యాన్నీ విశాలదృష్టినీ లోపింప జేసుకొని రాజదర్బా ర్లలో ఉండే నటవిటకోటిలో చేరిపోతుంది.



# 3

## కళా స్వరూపం

కళను గురించి చర్చించేటప్పుడు కళ అంటే ఏమిటో వివేచించడం అవసరం. మానవునికి కళ్ళు, ముక్కు, చెవులు మొదలైన ఇంద్రియాలు గల శరీరము, కుటుంబాలకు ఇళ్లు, సమాజానికి శాసనవ్యవస్థ అవసరమైనట్లు కళకు వివేచనఅవసరం. కాని నా అభిప్రాయంలో ఈ వివేచన అనేది కలియుగంలోని వస్తువు. ఒక వ్యక్తి వివేచన ప్రారంభించాడంటే అదిచూచి సామాన్య మనుష్యుడుగూడా ఆ వస్తువును తెలుసుకొనే దానికంటే, ఆ వస్తువులోని మంచిచెడ్డల్ని విమర్శించడానికి ఎక్కువ ఉబలాట పడతాడు. అక్కడనుండి తర్కవితర్కాలు బయలు దేరుతవి. తర్కసమ్మతమైన పరిభాషను చెప్పడానికి ప్రారంభించేసరికి అసలు కళాస్వరూపమే మాయమై పోతుంది. మనబుద్ధి కళాస్వరూపాన్ని తెలుసుకో లేకుండా పోతుంది.

కళానందాన్ని అనుభవిస్తూ కళను పూర్తిగా తెలుసుకునే తేలికవిధానాన్ని వదలిపెట్టి దానివివేచన ప్రారంభించడం అందమైన పూవును వాసనచూచి ఆనందించడం వదలి, ఒక పదునైన కత్తితో ముక్కలు ముక్కలుచేసి దాని లోపలి విషయాలను, దాని నిర్మాణవిధానాన్ని పరిశీలించినట్లు ఉంటుంది. వివేచనవల్ల కళాప్రతీతి కలిగినట్లు కనిపించినా, శుద్ధకళానుభూతి వివేచనద్వారా ఎవ్వరికీ కలిగినట్లు కనబడదు.

సదాచారాన్ని, ధర్మాన్ని వివేచించడం ఎంతకష్టమో కళలక్షణాన్ని—పరిభాషను నిర్వచించడం అంతకష్టం. పెద్దల

శుశ్రూష చేయడంవల్లా, పెద్దలసంపర్కంలో ఉండి వారు నడిచే నడవడికను చూడడంవల్లా, సదాచారస్వరూపాన్ని అవగతం చేసుకొన్నట్లుగా కళారహస్యాన్ని గూడా సంస్కార వంతులు, శిష్టులు, కళాధురీణులైన వారి సత్సాంగత్యంవల్లా, వారి కళాప్రవృత్తుల వైపు దృష్టి సారించడంవల్లా హృదయంగమం చేసుకోవచ్చును.

తార్కికశైలితో, దార్శనికశైలితో కళావివేచనం చేయడం మాని, తనకు ఏది రుచించింది, ఏది రుచించలేదు, ఎందువల్ల, అనేదాన్ని సామాన్యమైన మాటలతో చెప్పితే కళకు, కళారాధకులకు నిజమైన సేవచేసిన ట్లవుతుంది.

కాని నేడు కళ అనే పేరుతో పనికిమాలిన వస్తువులు, ఎన్నో బజారులో చలామణీ అవుతున్నవి. విలాసతృష్ణ కళను పూర్తిగా ఖోబరుచుకొన్నది. అందువల్ల నిజమైన కళా స్వరూపాన్ని మనం నిర్వచించక పోయిన పక్షంలో, ప్రోత్స హిస్తున్నాము, ముందుకు తీసికొని పోతున్నాము–అనుకొంటూనే కళను ఖూనీచేసిన ట్లవుతుంది.

శుక్రనీతిలో 'కళ మూగవాడికి సులభమైనది' అని చెప్పబడి ఉన్నది. సాహిత్య, సంగీతాలకూ, కళకూ పరస్పరం ఏమీ సంబంధం లేదని చెప్పడానికి. బహుశా ఈ నిర్వచనం చేయబడిందేమో నని నా అనుమానం. అయినా మూగవాళ్లుగూడా మాట్లాడలేక పోవచ్చును, కాని వ్రాయవచ్చునుగా! ఈ నిర్వచనంలో ఉన్నలోపంగూడా ఇదే. ప్రస్తుతం లలితసాహిత్యం అంతా కళకు ముఖ్యాంగంగా చలామణీ అవుతున్నది. వాట

కాలు, కావ్యాలు, కథలు, సరళమైన భాషలో వ్రాయబడిన వ్యాసాలు అన్నీ కళాకృతులుగా పరిగణింప బడుతున్నవి. పుస్తక రచయితలే ప్రస్తుతం ముఖ్యకళాకారులుగా పరిగణింప బడుతున్నారు.

ఇంకొక పక్షం వారున్నారు. వారు ప్రకృతి సౌందర్యం ఎంతమనోహరంగాను, ఆకర్షకంగాను ఉన్నా దానిని కళ అనడానికి వీలులేదంటారు. కళ మనుష్యుని రచన అయి ఉండాలి అంటారు. అదే యథార్థంలాగా కనబడుతున్నది. ఇక్కడ కొంతసేపు చర్చను ఆపి, ప్రకృతిసౌందర్యంలోనే కళ లేక పోయినా, కళాసృష్టికి దోహదంచేసే శక్తి ప్రకృతిలోనే ఉన్నది అని చెప్పవలసి ఉన్నది. కళాస్వరూపాల నన్నిటినీ మూల రూపంలో ప్రకృతిలో నుండే మనం తీసుకొంటాము. మొదటి ఆకర్షణ ప్రకృతిగతమై ఉంటుంది. దాన్ని ధ్యానించి, దాని ఆధారంమీద మానుష్యములు, దైవికములు, అయిన భావాలను సృష్టిస్తాము. ఆభావాలను సృష్టించే శక్తి కూడా ప్రకృతిమీదనే ఆధారపడి ఉంటుంది. సౌందర్యానికీ, భావాలకూ, సమ్మిశ్రణం కలగడంతోనే సృజనశక్తి జాగరితమౌతుంది. ఆ సృజనశక్తి వారి వారి ప్రతిభ ననుసరించి కొత్త కొత్త ఆకారాలను, కొత్త కొత్త వర్ణవిన్యాసాలను, కొత్త కొత్త ఆలాపనలను పుట్టిస్తుంది. భావజాగృతి, నవీనభావరచన, భావ సమ్మేళనము, అందువల్ల కలిగే అశాంతి, ఆ అశాంతిలోనుండి పుట్టే తృప్తి ఇదంతా కళాస్వరూపమే. అందుకు బాహ్యరూపంలో ఏ వస్తువును ఉపయోగించామనేది గౌణవిషయం. మట్టి, రాయి, కర్ర, ధాతువులు, గ్లాసు, సబ్బు, మైనము, ఏనుగుదంతము

మొదలైన ఏ వస్తువు సహాయం తీసుకొన్నాసరే, రంగు, రేఖ, దారము, మణి మొదలగు ఏ వస్తువును ఉపయోగించినాసరే, గద్యపద్యాలలో దేనిలోఉన్నాసరే, మూకఅభినయంలో ఉన్నా సరే, భవన నిర్మాణానికి, నగరనిర్మాణానికి లేక సమాజనిర్మాణానికి దేనికిసంబంధించినా సరే, మహాకావ్యసంవిధానానికి సంబధించినాసరే, కళ అన్నిచోట్లా ఒక్కటే. కళోత్పత్తి వస్తు సంగ్రహంలో గాదు, మనుష్యుని హృదయంలో ఉంటుంది.



# 4

## కళ, విలాసతృష్ణ

హృదయంలోని రూపంలేని భావాలను రూపవంతము లైన వస్తువుల ద్వారా వ్యక్తపరచడమే కళయొక్క ముఖ్య కర్తవ్యం. ఈ రూపవంతములైన వస్తువులు రూపరహితములైన భావాలకు వాహనాలు కావడానికి బదులుగా తమవైపునకే మనుష్యులను లాగుకొంటూ ఇంద్రియాలకు వాటికి స్వాభావిక మైన విషయవాసనా జనితమైన తృప్తిని కలగజేయుడం ప్రారంభిస్తే కళ చచ్చిపోతుంది. ఒకవేళ చావక పోయినా కళ వికృతం తప్పకుండా అవుతుంది.

అందువల్లకళ, విలాసము రెండూ దగ్గరగా ఉన్నప్పటికీ, మానవజీవితంలో రెండింటికీ స్థానం ఉన్నప్పటికీ రెండూ ఒక దానితో ఇంకొకటి కలవవు. త్యాగి అయిన మనుష్యుడు జీవిత ప్రలోభనాలకు వశుడుగాడు. ఈ ప్రలోభనాలపై జయమ్మాన్ని

సంపాదిస్తాడు. తాంత్రికుడు ఈ ప్రలోభనాలకు వశుడై కూడా పరమతత్వాన్వేషణార్థం నిర్లిప్తంగా ఉండి తటస్థభావంతో దర్శనశ్రవణాదులను చేస్తూ, వానిలోనుండి ఒకదానిని సాధనంగా చేసుకొని బ్రహ్మానందసహోదరమైన ఆనందాన్ని అనుభవిస్తాడు. కళాసాధన చాలా కష్టమైనది. అపాయకరమైనది. కాని రహస్యం చేజిక్కిన వారికి మహదానంద ప్రదం.



## 5
## సౌందర్యము, సత్యము

కళ ద్వారా పరమతత్వసందర్శనం కలిగితీరుతుం దని ఎవ్వరూ చెప్పలేరు. కళాసాధన పూర్ణం అయినప్పటికీ, కళాతీతమైన తత్వాన్ని సందర్శించడానికి వేరుగా సాధన చేయవలసి ఉంటుంది. ఆ సాధన పరిపక్వమైననాడే సత్యనారాయణుని దర్శనం సంప్రాప్త మవుతుంది. కేవలం కళ, తత్వజ్ఞాన స్థానాన్ని ఆక్రమించలేదు. కళ తరచుగా కళాతత్వాన్ని గురించి మాత్రమే చెప్పుతుంది. అంతేకాని కళను వెదకదు. అందుకు ప్రత్యేకసాధన అవసరం. సౌందర్యదర్శనం సత్యాన్వేషణావసరాన్ని పూర్తిచేయలేదు. సత్యం సుందరంగా ఉంటుంది. సౌందర్యము స్వయంగానే ఒక మహాత్సత్యం. అన్ని సత్యాలు ఆకర్షకంగా ఉంటా యని చెప్పడానికి వీలులేదు. సౌందర్యానుభూతి; శుద్ధసత్యమయ మని అనడానికిగూడా వీలు లేదు. కాని, సత్యం, శివం, సుందరం అనేవి మూడు ఒకే మంగళతత్వం

యొక్క స్వతంత్ర విభూతులు. అందువల్ల ఈ మూడింటిలో పరస్పరానుకూలభావాల సామంజస్యం ఉండితీరాలి. అయితే ఈ మూడూ వేరువేరుగా సర్వస్వతంత్రాలు. అట్లు గాక ఈ మూడూ ఒకదానిలోనుండి ఇంకొకటి పుట్టినట్లయితే హేతువాద నిష్ణాతులైన మనపూర్వులు ఈ మూడూ ఈశ్వరుని స్వతంత్ర విభూతులు అని అంగీకరించి ఉండేవారు కారు.

సత్యాన్వేషణ, కళాప్రతీతి, ఈ రెండూ వేరు వేరు పనులు. తత్వంఅనే కోటను వశం చేసుకునేటందుకు వేరు వేరు దండయాత్రాసాధనాలు. రెంటింటికీ వెనుకనుఉన్న ప్రవృత్తులు వేరువేరు. వాటి ఫలప్రాప్తికూడా వేరువేరుగానే ఉంటుంది. కళారసికుడు తన మనోవృత్తులను, భావనలను, కోమలాలుగా, తీవ్రమైన వానినిగా, శీఘ్రచైతన్యం కలవిగాచేస్తే సత్యశోధకుడు తన మనోవృత్తులను, భావనలను, తన వశంలో ఉంచుకొని, వాటిని సంయమించి, తన జిజ్ఞాసను తీవ్రంచేసుకుంటాడు. బుద్ధిని ఏకాగ్రంగాచేసి అనన్యనిమగ్నలవాడవుతాడు. ఈ ఇద్దరికీ మూలసాధనలోనే ఇంత భేదం ఉన్నది. సత్యశోధకునికి దొరికిన దానితో కళాస్రష్ట తృప్తిపొందలేడు. కళాస్రష్ట విశ్రాంతి తీసుకొన్న ప్రదేశంనుండి సత్యశోధకుడు ప్రయత్నాన్ని ప్రారంభిస్తాడు. కళాదర్శనం మెరుపు ప్రకాశం లాగాఉంటుంది. సత్యాన్వేషణ విజ్ఞానవేత్తల ప్రయోగం లాగా గంభీరంగా ఉంటుంది.

కళామయమైన దృష్టిలేనివాడు గంభీరమైన సత్యాన్వేషణం చేయడం అసంభవమని అందరూ అంగీకరించారు.

అంటే గొప్పగొప్ప విజ్ఞానశాస్త్రజ్ఞులూ, తత్వవేత్తలు అందరూ మొదట కళాదర్శకులు అన్నమాట.

కాని ఈ విధంగా నిర్ణయం చేయడం వలన కళాకారుల ప్రతిష్ఠతో బాటు బాధ్యతకూడా ఎక్కువవుతుంది. వారు కేవలం కళాదర్శనం మాత్రం పొంది సంతృప్తులై కూర్చున్నట్లయితే జీవనద్రోహులవుతారు. రసికులు ఇంతవరకు "కళాకారుని జీవితంతో నీకేమిపని, కళాకారునికళాకృతిని మాత్రం చూడు"అంటూవచ్చారు. కాని ఇప్పుడింకా ఆమాటసాగదు. కళాకారుడు తన జీవితనిర్వహణంలో కూడా వీరుడు కాకపోయినట్లయితే, అతనికి ఎటువంటి శిక్ష విధించినా మాకు సమ్మతమే అని చెప్పుతున్నాను. ఊరికే దొరికిన ధనాన్ని విశ్రాంతిగా అనుభవిస్తూ, పొట్టలు పెంచుకొనే రోజులు మారిపోయినవి. కళాకారుని కృతినుండేగాక జీవితంలోనుండి కూడా సందేశం ఉట్టిపడాలి.



# 6

## కళ, నీతి

కళకూ, నీతికీ అంటే సదాచారానికీ సంబంధం ఏమిటి? అని ప్రశ్నించేవారు ఇప్పుడు చాలామంది బయలుదేరారు. "కళసదాచారానికిదాసిగాదు, నీతికి సంబంధించిన నియమాలు, నీతి విషయంలో చెల్లవచ్చును, మాకళకు వానీతితో ఏమి సంబంధం? కళ ఎవరినీ, దేనినీ, లెక్కచేయదు" అని కొంత

మంది అభిమానంగా గర్వంగా చెప్పుకొంటున్నారు. కొంత మంది ఇంకొక రకపు కళోపాసకులు ఇంకా రెండడుగులు ముందుకుపోయినారు. వారు "నీతి ఎక్కడబడితే అక్కడ విధి నిషేధాలనే బోర్డులను తగిలించి జీవనోద్యానవనంలోని సౌందర్యాన్నంతా నాశనం చేసింది. తన మొండితనంవల్ల నీతి జీవితానికి ఆనందాన్ని సమకూర్చలేకపోగా - జీవితాన్ని బాగు చేయలేకపోగా-ఉన్న ఆనందాన్నీ, సుఖాన్నీ ఎక్కడ కక్కడ నాశనం చేసిపారవేసింది. జీవితంలోని స్వాభావికతను నాశనం చేసి వికారాలను సృష్టించింది. నీతిలాంటి ఆనందవిధ్వంసక శక్తి మరింకొకటి లేదు. నీతి పాడుచేసిన దానిని కళ బాగు చేయవలసి ఉంటుంది. కళచేతిలోనే జీవితం సురక్షితంగాను, సుఖంగాను ఉండగలుగుతుంది. కళకు నీతితోటీ, సదాచారం తోటీ ఏమీ అవసరంలేదు. సదాచారధర్మాన్ని చాలా రోజులు అనుసరించాము. ఇక చాలు. కళను జీవితధర్మం చేసుకోండి" అని చెప్పుతున్నారు.

ఉత్సాహవంతుడైన ప్రతికొత్త ఆవిష్కారకుడు కూడా పూర్వపుదానిలో ఉండే దోషాలను, లోట్లను తొందరగా చూపించగలుగుతాడు. కొత్తప్రయోగం ఇంకా ప్రారంభం కాలేదు గనుక దానిలోని దోషాలను ఎలాగ చూపించడం? పూర్వపువాటిలోని దోషాలను ఇంత తెలివిగా చెప్పడంచూచి, అతని దృష్టి విశాలంగాను, వ్యాపకంగాను ఉంటుందని వెంటనే సహజంగా నమ్ముతాము. పైనజెప్పిన కళోపాసకుడు ఈ విశ్వాసాన్ని ఆధారంగా తీసుకొని ధర్మాన్నీ నీతినీ, సాంఘికాచారవ్యవహారాలనూ, లోకమర్యాదనూ,

రాజనియమాలను వదలి పెట్టి 'మామేకం శరణంవ్రజ' అని ప్రారంభిస్తున్నా డన్నమాట. కళవంటి రమణీయశక్తి, ప్రేరక శక్తి, జీవితానికి అధిపతులైతే, దానివలన మానవజీవితానికి శుభపరంపరలు కలుగుతూ ఉంటే అంతకంటె ఇంకేమి కావాలి ?

కళకు ఉన్న వ్యాపకమైన అర్థాన్ని అంగీకరించి కళ జీవిత కళ అనీ, సమస్తధర్మాలయొక్క సమన్వయమనీ, ఆదర్శజీవితంలోని సహజపరిమళ మనీ అంగీకరిస్తే చెప్పవలసింది ఏమీ లేదు. కళలోని మంగళకరస్వరూపాన్ని అంగీకరించిన మీదట కళకు ప్రతినిధులై కళకారణంగా సమాజానికి నాయకత్వం వహించిన వారినిబట్టి, వారి నాయకత్వాన్ని అంగీకరించడమో, అంగీకరించక పోవడమో నిర్ణయించుకోవలసి ఉంటుంది. తాత్త్వికదృష్టితో చూచినప్పుడు ధర్మము, నీతి మొదలైన వస్తువు లన్నీ నిర్దోషాలే. కాని, ప్రత్యక్షవ్యవహారంలో శిక్షణ కళావేత్తలు అశిక్షితులుగాను, ధర్మాచార్యులు, అధర్మాచార్యులు అనాచారమూర్తులుగాను కనబడుతున్నారు. ఒక రాజకన్యకకు విద్యనేర్పిన విదుషీమణినిగురించి ఎవరో చెప్పిన మాట జ్ఞాపకానికి వస్తున్నది. She taught virtue by precept and vice by example సద్గుణాలను ఉపదేశాల ద్వారాను, దుర్గుణాలను ఆచరణద్వారాను నేర్పిం దని అర్థం. ధర్మాచార్యులీన్ని, శిక్షణకళావేత్తలీన్ని, న్యాయాధీశులీన్ని, పత్రికా సంపాదకులీన్ని, లోకసేవ చేస్తున్నా మనుకొనేవారినీ మీహృదయాలనువెదకి సమాధానంచెప్పండి అని ప్రశ్నవేస్తే అందరూ కంగారు పడవలసిఉంటుంది. నీతిని విమర్శిస్తూ కళోపాసకులు

తాము పెద్దపెద్ద అఖాతాలలో పడిపోతున్నారు. కళాసాధన చాలా కష్టమైనదని పైన మనవిచేసియే ఉన్నాను. ధర్మానికి సదాచారానికి, లోకరుచికి తిలాంజలి యిచ్చి కేవలం మేము కళోపాసకులం అని భావించినవారికి కలిగిన అధఃపతనాన్ని చూస్తే భయం కలుగుతున్నది. సాటిలేనివారని మెప్పుపొందిన నూతనరాగసృష్టి లగు గాయకులు, చిత్రాలద్వారా రోజూ గంధర్వనగరాలను సృష్టించే చిత్రకారులు, కవిత్వంద్వారా గుండెలను కదలించి, జీవితానికి నూతనజాగృతి నిచ్చి, మానవునిలో అలౌకికానుభూతులను కలుగజేసిన కవులు మొదలైన వారి జీవితాలు, సామాన్యవ్యక్తిగూడా చూచి అసహ్యించుకొనేటంత నికృష్టంగా తయారవుతున్నవి. సామాన్యవ్యక్తి అదంతా చూచి ఆశ్చర్యనిమగ్నుడై, భగవంతుడు ఈ దివ్యశక్తిని ఈ కుళ్ళు హృదయాలకు ఏలాగ ప్రసాదించాడు అని ప్రశ్నిస్తున్నాడు.

కాని, దానిలో ఆశ్చర్యం ఏమున్నది? వర్షఋతువు అంతమైన తరువాత బురదలో, మురికిలో, నాచులో, విషపు పురుగులతోనిండి నిలువైనా లోతులేని ఎన్నో తటాకాలు తమలో ఎన్ని లోపాలున్నా, ఎంతమురికి ఉన్నా; పైకిమాత్రం స్వచ్ఛంగాకనిపిస్తూఅనంతఆకాశాన్ని, చిత్రవిచిత్రమైన రంగులు గల మేఘాలనూ, వాటిలో మిణుకుమిణుకు మని ప్రకాశిస్తూ ఉండే అగణితతారాగణాన్ని తమలో ప్రతిబింబింప జేసుకొంటున్నవి. నిలువులోతైనా లేని తటాకరంలో అనంతాకాశంతాలూకు ప్రతిబింబం పడటానికి అవకాశమున్నపుడు సామాన్యవ్యక్తి జీవితమంతయునా స్వచ్ఛము, పవిత్రము గాని

జీవితం గలవాడయినా కళాకారుడు మానవజీవితంలోని అసంఖ్యాకములైన గంభీరరహస్యాలను బయటపెట్టడంలో ఆశ్చర్యం లేదు. వారికి ఆ శక్తి ఏలాగ లభ్యం అవుతున్నది, ఆ దివ్యశక్తి వారి జీవితాన్ని ఎందుకు మార్చలేక పోతున్నది అనేది ఈశ్వరసృష్టిలోని ఒక పెద్దరహస్యం. ఏ కళాకారునిదగ్గర చూచినా సదాచారము, సద్వృత్తి, ఆర్యభావము ఉన్నట్లు నాకు కనబడడం లేదు. పరమనీచుడైనవాడు కూడా ఉత్తమ కళాకృతిని సృష్టించవచ్చును. అంతమాత్రంచేత వానవికజీవితానికీ, కళారచనకూ సంబంధం ఉండనవసరం లేదనడం సాహసం. కళ, సదాచారము, రెండూ ఒకదానికొకటి సహాయకంగా ఉండాలి. ఈ రెండింటికీ సమన్వయం ఉండితీరాలి.

మనం కళద్వారా జీవితంలోని కోమలాలు, లలితాలు అద్భుతాలు అయిన ప్రసంగాలను గురించేశక్తిని పెంపొందింపజేసుకొన గలుగుతున్నాము. దానితోపాటు కళవలన ఉత్తమ సంస్కారాలను, ఉదాత్తమైన ఆశయాలను కూడా పెంపొందింప జేసుకోగలగాలి. దురాచారాలకూ, పాపానికీ, దుష్టత్వానికీ, నీచత్వానికి, మందు దొరుకుతుంది. కాని సిగ్గులేనితనానికి మాత్రం మందు ఎక్కడా దొరకదు. ఒకొక్కప్పుడు కొంతమంది కళాకారులు ఉన్నతమైన కళావిభూతులను చూపిస్తూ దేవాలయాలపూజారుల్లాగా, తీర్థస్థానాలలోని పండాలలాగా గుడ్డినమ్మకం కలవారుగా తయారవుతున్నారు. వారిదగ్గర ఏ అప్పీలూ పనిచేయడంలేదు. ఒక ఇంగ్లీషుకవి వారిది "లెదర్ హార్ట్" అన్నాడు.

కళ, నీతి, సదాచారము, సురుచి వీనిమధ్య విరోధ భావం కలగజేయడమే తప్పు. జీవితానికి విద్రోహం చేసే ఏ వస్తువూ, ఉత్తమ మనుష్యునకు కళాపూర్ణంగా కన్పించనే కన్పించదు. ఈ పదార్థం ఎంగిలిది; ఈ స్త్రీ కులట; ఈ పండు విషతుల్యము: ఈ ఉపదేశకుడు శత్రువుపంపిన గూఢచారుడు అని తెలియడంతోనే ఆయా వస్తువులమీది ఆకర్షణ తత్క్షణం నశించిపోతుంది. అదేవిధంగా సదాచారానికి వ్యతిరేకంగా ఉన్నచోట-దుఃఖమూ, మోహము, పశ్చాత్తాపము తప్ప ఇంకా ఏమీ ప్రాప్తం కాదనే భావం కలిగినచోట - మనకు ఆకర్షణ కలగనే కలగదు. పొరపాటున తెలియని స్థితిలో ఆకర్షణకలిగినా యథార్థం బోధపడినవెంటనే ఆ ఆకర్షణ నశించిపోతుంది జీవన ద్రోహి అయినవాడు మాత్రమే అక్కడ ఉండగలుగుతాడు.

సదాచారమే జీవితసౌందర్యం. న్యాయము, ఉదార భావము, ఓర్పు, శాంతి, త్యాగము, వీరత్వము ఇవే జీవితం లోని ఉత్తమ అంశాలు. వీటిని మోసగించి, వీటిని తిరస్కరించి ఏ కళఅయినా, ఎంత సుందరంగాఉన్నా సహృదయులను తన వైపునకు ఆకర్షించుకోలేదు.

సదాచారం పేరుతో అనేకమైన మూఢాచారాలు, సంఘనాయకుల నిరంకుశ ప్రవర్తనాలు సంఘంలో చలా మణీలో ఉన్నవని నాకు తెలుసును. అట్టి వాటిని సమూలంగా నాశనం చెయ్యావల్సిందే. సందేహంలేదు. అంత మాత్రంచేత కళ/తన స్వాతంత్ర్యాన్ని ప్రకటించడానికి, సదాచారాన్ని ఉల్లంఘించాలి అన్నప్పుడు అర్థంఉండదు. సదాచారం కూడా చివరకు అన్నిటికంటె ఉత్తమమైన జీవితకళ కాదుగదా!

కళ విషయంలో సీతేగూడా తన అత్తగారి ప్రవృత్తిని, ప్రవర్తనను వదలిపెట్టాలి. ఇష్టవస్తువును తటస్థంగా స్వీకరించి, తటస్థభావంతోనే దానిని ఉపయోగించి యోగిపలె ప్రారంభంనుండి చివరవరకూ ఆ వస్తువు విషయంలో అనాసక్తుడుగా ఉండడంలోనే కళా వైదగ్ధ్యం కనపడుతుంది. ఈ కౌశల్యం లేనినాడు అతడు నిజమైన కళాకారుడు కానేకాలేడు. సదా చారానికి కాముకత్వము, విలాసతృష్ణ, లంపటత్వము మొదలైనవి ఎంత శత్రువులో కళకుగూడా అవి అంతే శత్రువులు. ఈ విషయాలను దృష్టిలో పెట్టుకొన్న ఉత్తమ కళాకారులు ఉద్భూతం కావాలి.

మనం నకుములు భోగించకపోతే లోకంలో అనాచారం, విలాసతృష్ణ పెంపొందుతుందని అనుకోవడంతప్పు. అలా అనుకోవడం ప్రారంభిస్తే మనలో శ్రద్ధతక్కువనీ, నాస్తికభావం పెరుగు అనీ, అహంకారప్రవృత్తి అధికమనీ, అనుకోవలసి వస్తుంది. ఈ విశ్వమందంతటా చేతనతత్వం నిండినిబిడీకృతం అయి ఉండడంవల్ల ఈ సదసద్రూపమైన జగత్తులో మనుష్యుడు ఎంతకోరినా దుర్మార్గుడు కాలేడు. నిజమైన మహాత్ముడు కావడం ఎంతకష్టమో పరమదుర్మార్గుడు కావడంకూడా అంత కష్టమే. ప్రతిపాపానికీ, ప్రతి పతనానికీ విరుగుడుగూడా దానితోబాటే ఉంటుంది. చివరకు తన పాపాన్ని చూచుకొని మనుష్యుడు విధిగా భయభ్రాంతుడై పశ్చాత్తాప పడతాడు. అందువల్ల మనుష్యుడు గజగ్రాహాలకువలె పాపపుణ్యాలకు, సదాచార దురాచారాలకు, సురుచి, అరుచులకు మధ్య జరుగుతున్న మహాసమరంలో సత్పక్షంవైపున కే మొగ్గుతూ ఉండాలి.

అల్లరి చేయడం, ధైర్యం ప్రోగొట్టుకోవడంవల్ల ఏమీ లాభం లేదు. సంఘాన్ని, ప్రపంచాన్ని మరామత్తు చేయడానికి ప్రానుకోనేదానికంటె ముందు మనం మంచిమార్గంలో నడవ డానికి ప్రయత్నించేస్తే దానివల్లనే చూచేవారుగూడా మంచిని అలవరుచుకొంటారు. సదాచార రూఢాచారాల మధ్యఉన్న భేదాన్నిగూడా బాగా అర్థంచేసుకోవాలి. సదాచారం అనేది హృదయధర్మం. అది లోపలి స్వచ్ఛతమీద ఆధారపడి ఉంటుంది. రూఢాచారం సాంఘిక విశ్వాసాలమీద ఆధారపడి ఉంటుంది. సామాన్యజనుల భావనలమీద ఆధారపడిఉంటుంది. ఒక ప్పుడు శరీరంలోని అంగాలను సాధ్యమైనంతవరకు మూసి ఉంచడం సదాచారం అనుకోబడేది. రాను, రాను అది వేరు రూపం దాల్చింది. ఆకారణంవల్ల చిత్రాలలో నగ్నరూపాన్ని చూపిస్తే సామాజికనీతిలో విప్లవం వస్తుం దనే భావం ప్రబలి పోయింది.

నరిళభావం ఉన్నచోట పవిత్రభావం ఉండితీరాలి అని కొంతమంది పైదానికి వ్యతిరేకంగా చెప్పుతున్నారు. రూఢాచారంలో అనాచారం దాగుకొని ఉన్నట్లుగా స్వైరా చారంలో గూడా అనాచారం ఉంటుంది అని అనుభవంవల్ల మనకు తెలుస్తున్నది. అందువల్ల రూఢినిష్ఠలో సత్యనిష్ఠ ఉండాలి. ఉంటుంది అనేది ఋజావు కావడంలేదు. కళలో నగ్నరూపాన్ని చూపించవచ్చునా, లేదా అనే విషయంలో చాలారోజులనుండి వాదవివాదాలు జరుగుతూ ఉన్నవి. పూర్వకాలంలో తాంత్రికులు నగ్న రూపోపాసన ఎక్కువగా చేశారు. దాని పరిణామాన్ని మనం చూశాము. అనుభ

వించాము. అయినా నగ్నరూపంలో కూడా పవిత్రభావాన్ని చూపించవచ్చును. దక్షిణభారత దేశంలో భద్రబాహు, బాహుబలి, గోమటేశ్వర విగ్రహాలు నగ్నరూపంలో ఉన్నవి. అవి ఎంత విశాలంగానూ, ఎంత పెద్దవిగానూ, ఉన్నవంటే కొన్ని మైళ్ళ దూరాన్నుండి ఆ విగ్రహాలను చూడవచ్చును. ఆ విగ్రహాల ముఖంమీద తాండవ మాడుతుండే శాంతభావాన్ని చూచినప్పుడు దర్శకునకు ఆ నగ్నరూపాలు పవిత్రభావాన్నీ, అమరశాంతినీ ప్రసాదిస్తున్నవి. పురుషశరీరం కానివ్వండి, స్త్రీ శరీరం కానివ్వండి, పశు పక్ష్యాదుల శరీరాలే కానివ్వండి - ఆకృతుల్లో భీభత్సమనేది ఏమీ ఉండదు. అశ్లీలం అనేది శరీరంలో కాదు, మనస్సులో, మనోభావంలో ఉంటుంది. వికారభావాలను ఉద్దీపనం కలుగజేసి డబ్బు సంపాదించడానికి ప్రయత్నాలు జరుగుతున్న ఈ రోజుల్లో ఆ విషయం మనకు అర్థంకాదు. సాహిత్యంలో, కళలో సామాన్యజనంయొక్క చిత్తవృత్తిని కాముకంగాను, విలాసనిమగ్నంగాను చేసే ప్రయత్నంలో మగ్నులై ఉన్న కళాకారులకూ, ఏమేమో తిని, ఏమేమోచేసి వీర్యహీనులైపోయిన నవాబుల దర్బార్లలో ఉండి, వారిలో అణిగిపోయిన విషయవాసనా ప్రవృత్తిని ఉద్దీపింపచేయడానికి మందులిచ్చే వైద్యులకూ, నాకేమీ భేదం కనపడదు. సమాజానికి విటవర్గం అవసరమయితే కావచ్చును. వారిని కళాకారు లని పిలవడం మాత్రం అన్యాయం.

శుద్ధసౌందర్యదృష్టితో సాహసించి నగ్నస్వరూపాలను చిత్రించడానికీ, కాముకప్రవృత్తిని ప్రోత్సహించే చిత్రరూపాలను తయారుచేసి వికారగ్రస్తులైన వారి ప్రశంసలకుపాత్రులు కావ

డానికీ, ఆకాశానికీ, పాతాళానికీ ఉన్నంతభేదం ఉన్నవి. వికార ప్రవృత్తిలో క్షణికోత్తేజనం ఉంటుంది. అంతంలో బల హీనత, నిరాశ, నిస్పృహా నిండిఉంటుంది. సిగ్గు లేకుండా ప్రవర్తించడం అలవాటు కాకపోతే, కొద్దిగా సిగ్గుకూడా ఉంటుంది.



# 7

## కళానందము

కళా విషయకాలయిన అనేకవర్ణనలను, పరిభాషలను చదివి, జీర్ణించుకొని నేను ఒకసూత్రాన్ని ఏర్పాటు చేసుకొన్నాను. దానిని పరిభాష అనడానికి వీలులేదు. కళా వ్యాకరణం అనవచ్చు ననుకొంటాను. అన్ని పరిభాషలకంటే ఇదే యుక్తమైన దని నాకుతోచింది. ఈ సూత్రాన్ని యోగ విద్యలోనూ, విద్యావిధానంలోనూ, జీవితంలోనూ కూడా సమన్వయపరచవచ్చును. నా ఉద్దేశ్యంలో కళారహస్యం కూడా అదే. ప్రాపంచిక సుఖభోగానికీ, కళానందానికీ ఎంతో భేదం ఉన్న దని కళాకారు లంతా అంగీకరిస్తున్నారు. ఇంద్రియాలకూ, వాటి విషయాలకూ ఉన్న సంబంధంవల్ల సుఖ దుఃఖాలు రెండూ కలుగుతున్నవి. కాని ఆ సంబంధంవల్ల వచ్చే సుఖం స్థాయియై, పరిణామంలో రమణీయం కావడం లేదు. కళానందస్వరూపం మాత్రం అందుకు భిన్నం. కళ సుఖదుఃఖాలు రెండింటిలోను సమానంగానే ఆనందాన్ని

కలుగజేస్తుంది. దుఃఖాంతమైన నాటకాన్ని చూసి కరుణార్ద్ర హృదయులం అయి కన్నీళ్ళు కారుస్తాము. అయినా ఆ నాటకాన్ని వదలిపెట్టలేము. మళ్ళీ మళ్ళీ చూడవలెననీ, మళ్ళీ మళ్ళీ చదవవలెననీ ప్రయత్నం చేస్తాము. ఏ దరిద్రావస్థలో మనం ఒక్క క్షణం కూడా ఉండడానికి సాహసించలేమో, ఆ దరిద్రావస్థను గురించిన వర్ణనను చదివినప్పుడు, చూచినప్పుడు మనలో కలిగే సహానుభూతి, * పుణ్యప్రకోపము, మనకు ఆనందాన్నే కలిగిస్తుంది ?

ఎందువల్ల ? అని ప్రశ్న. మనుష్యుడు దుఃఖాల్ని అభిలషించడు. కాని జీవితంలో ఉన్నది దుఃఖమేకదా ? అయితే ఆ దుఃఖంవల్ల ఒక ఉపయోగం కనపడుతున్నది. దుఃఖంవల్ల మనుష్యునికి అనుభవం హెచ్చుతుంది. వ్యక్తిత్వం భగవద్గీత పరిభాషలో అధ్యాత్మభావం వృద్ధి పొందుతుంది. (గీతలో "స్వభావో అధ్యాత్మం ఉచ్యతే" అని చెప్పబడియున్నది. ఇక్కడ స్వభావః అంటే మనుష్యుని కర్తవ్యం అని అర్థం. దానినే అధ్యాత్మం అనిగూడా అంటారు) సహానుభూతి కారణంవల్ల మన వ్యక్తిత్వం మననుండి వేరై, ఇంద్రియగతమైన బంధనాలను తెంచుకొని, సంకుచితక్షేత్రాన్నుండి బయటబడి వికసించి మన శరీరంకంటే వేరైన వ్యక్తులతో, మూర్తులతో, ఘటనలతో, తంత్రాలతో సారూప్యాన్ని పొందుతుంది. ఆనందమనేది ఈ వ్యక్తిత్వ వికాసమే. సాధారణంగా స్వస్థుడుగా ఉన్నప్పుడు మనుష్యుడు తన శక్తిని తాను తెలుసుకోలేడు. దుఃఖాలు, కష్టాలు సంప్రాప్తమైనప్పుడు తన

---

* పాప పుణ్యాల ప్రతీకారానికిగాను న్యాయబుద్ధి వలన కలిగిన ఆవేశం

శక్తిని సంపూర్ణంగా తెలుసుకో గలుగుతాడు. ఆ కష్టాలు అప్పట్లో కష్టాలుగా కాన్పించినా, తన శక్తిని తాను తెలుసుకో గలగడంవల్ల అతను మహదానందాన్ని పొందుతాడు. విజ్ఞానశాస్త్ర ప్రయోగాలు, జీవితానుభవాలు, అన్నీ మనకు వ్యక్తిత్వవికాసజనిత మైన ఆనందాన్ని కలుగజేస్తవి. ఈ వ్యక్తిత్వవికాస కళాకౌశలమే యోగము. విద్యాధ్యయనానికి గూడా ఈ వ్యక్తిత్వవికాసమే లక్ష్యము. జీవిత ప్రారంభదశలో మానవుడు ఇంద్రియముల ద్వారా సుఖదుఃఖ భావాలను అనుభవిస్తాడు. ఆ భావాలను వికసింప జేసుకొన్నప్పటికీ, వాటికి గౌణస్థానాన్నిచ్చి వాటిలోనుండి ఆధ్యాత్మికానందాన్ని అనుభవించడమే కళ చేసే పని. కళకు గౌరవం అప్పుడే. తియ్యని పక్వాన్నాలను తిన్నప్పుడు, మండువేసంగిలో చల్లని ఉపచారాలు లభించినప్పుడు, ఎముకలుకొరికే చలిలో వెచ్చని పక్క దొరికినప్పుడు సుఖం అందరికీ కలుగుతుంది. ఆ సుఖాన్నే ఆధారంగా తీసికొని పశుపక్ష్యాదులూ మనుష్యులూ జీవించి ఉంటున్నారు. ఆ సుఖంకోసమే వారు కష్టాల కోర్చి, బాధను సహించి పరిశ్రమ చేస్తూ తమ జీవితాన్ని గడుపుతున్నారు. కాని పంచభక్ష్య పరమాన్నాలను ఆనందంగా ఆరగించినంత మాత్రంచేత గొప్పవాడనీ, మహనీయుడనీ ఎవరినీ అనడం లేదు. విషయభోగాలను పశుపక్ష్యాదులు, మనుష్యులు గూడా అనుభవిస్తూనే ఉన్నారు. అందులో అసహ్యించుకోవలసిన విషయం ఏమీలేదు. "ఈ విషయభోగాలను మీరుచూడండి. జ్ఞాపకానికి తెచ్చుకోండి. వాటిని గురించి ఆలోచించండి" అని ఇతర్లను ఆహ్వానించడం ప్రారంభిస్తే మాత్రం తప్పక అన

హ్యాంచుకో వలసి ఉంటుంది. కాని ఈ భోగాలతో బాటుగా వాటివల్ల కలిగే భావన విషయం వేరుగా ఉంటుంది. ఆ భావన కావ్యానికీ కళకూ విషయం కావచ్చును. ఆ భావనా స్వరూపం అనేక రకాలుగా ఉంటుంది. అయినా దానిలో ఉండే ఆనంద తత్వం, తనకు మూలకారణం అయిన అధ్యాత్మవికాసమే. దానినే శాస్త్రకారి భాషలో తాదాత్మ్యత, తల్లీనత అంటారు. సూర్యోదయాన్ని, సూర్యాస్తమయాన్ని చూచేటప్పుడు దానిలో తల్లీనమైపోతాము. తన్మయులమైపోతాము. ఆ తన్మయత్వమే ఆనంతము. ఆ ఆనందంలోనే కావ్యాత్మ ఉంటుంది. కావ్యాత్మనే సాహిత్యంలో రసం అంటారు. రసశబ్దం "సృ-సర్" అనేదాని వర్ణ విపర్యయంవల్ల అనగా ఆ అక్షరం ఇటూ ఈ అక్షరం అటూ కావడంవల్ల ఏర్పడిందని నా ఉద్దేశ్యం. వృక్షాల్లోనుండి రసం ప్రవహిస్తున్నది. అట్లాగే మన హృదయం కరిగి ఒకానొక వస్తువు వైపునకు ప్రసరితం, రసితం, అయినప్పుడే మనం రసానుభూతి కలిగిందంటాము. అంటే వ్యక్తిత్వవికాసం కలిగిందన్న మాట.

వ్యక్తిత్వవికాసం–తాదాత్మ్యభావం–కలగడమే ఆనందం. కాని ఆ ఆనందం పొరపాటున ఇంద్రియతృప్తికి మాత్రమే తోడ్పడితే ఆ రసధార ఆత్మను సంకుచిత పరుస్తుంది. ఆత్మ అనాత్మలజ్ఞానాన్ని పోగొట్టి చివరకు అసలు ఆనందస్వరూపాన్నే విలుప్తం చేస్తుంది. ఆ స్వరూపావస్థానాన్నుండి క్రిందపడిపోవడమే భయంకరపతనం. ఇంద్రియతృప్తివల్లనే, ఆత్మవికాసం కలిగేటట్లయితే, ఆధ్యాత్మికసాధనలో దానికే ఉన్నతస్థానం ఏర్పడి పోతుంది. ఆనందప్రాప్తికి ఇంద్రియతృప్తి పనికిరాకుండా

ఉన్నది. ఇంద్రియాలకు సంబంధించిన సుఖాలను అనుభవిస్తున్నాము, కాని ఆసుఖాలవల్ల అంతంలో దుఃఖము, పశ్చాత్తాపము, నీరసస్థితి ఇవి మాత్రమే లభిస్తున్నవి. పాశ్చాత్య సంస్కృతిలో పెరిగి అన్ని రసానుభవాలను అనుభవించిన 'గేటే' కవి తన 80వ సంవత్సరం వయస్సులో "నాజీవితంలో నిజమైన సుఖాన్ని ఎనిమిదిరోజు లయినా అనుభవించలే"దన్నాడు.

మన హృదయం, మన ఆత్మ ఇతర వస్తువులతోనూ, వ్యక్తులతోనూ, తాదాత్మ్యభావం పొందినపుడే, మనలోని సంకుచితభావాలు, భేదభావాలు పోయి ఆనందానుభూతి కలుగుతుంది. ఆ వస్తువులయందు తాదాత్మ్యభావం కాక ఆసక్తి కలిగినట్లయితే, ఆత్మభావానికి బదులు అనాత్మభావం ప్రవేశిస్తుంది. అందువల్ల "షిర్కత్" అనే పాపాన్ని చేసినట్లవుతుంది. అనాత్మను ఆత్మ అనుకొన్నా, ఇతర దేవతలను భగవంతు డని అన్నా మహమ్మదీయమతంలో "షిర్కత్ గునాహ్" అవుతుంది. ఆ మతంప్రకారం అది చాలా పెద్ద పాపం. ఆ పాపాన్నుంచి విముక్తి చెందడానికి తాదాత్మ్యభావాన్ని, తటస్థవిధానాన్ని అనుసరించవలసి వస్తుంది. తటస్థత లేనిచోట అధ్యాత్మభావం ఉండదు. సుఖదుఃఖాతీతమైన అనుభూతికూడా ఉండదు. కావ్యానంద, కళానంద, గానానందాలు ఇంద్రియాలవల్లనే ప్రాప్త మయ్యేవైనా ఇంద్రియ నిరపేక్షాలు కాగలుగుతవి. ఇంద్రియ నిరపేక్షాలైనంతసేపు, పరమానంద స్వరూపాలయినట్లే భావించవలసి ఉంటుంది. ఎందువల్లనంటే అప్పుడవి స్థాయిత్వాన్ని పొందుతవి.

పవిత్రాలవుతవి. ఆ ఆనందంలో దుఃఖానికీ, విషాదానికీ, వికారాలకూ, పశ్చాత్తాపానికీ, తావుండదు. పరిశుద్ధమైన ఆ కళానందంలో ఆసక్తి అనేది ఉండనే వుండదు. తాదాత్మ్య భావాన్ని, తటస్థతను రెంటినీ సమానంగా వికసింపచేయ గలిగిన చోటనే-అనుభవించగలిగిన చోటనే-మనకు కళానందం లభ్య మవుతుంది. మోక్షసాధనలో అనాసక్తి యోగంద్వారా విష్ణువు, పరబ్రహ్మ అని చెప్పబడే వ్యాపకత్వాన్ని సాక్షాత్కరింప జేసుకొన్నట్లుగా ఈ తటస్థతాయుక్త తాదాత్మ్యభావం ద్వారా విగళిత వేద్యాంతరమయిన లోకోత్తరానందాన్ని అనుభవించ గలుగుతున్నాము.

ముఖ్యవిషయం నుండి వైదొలగి ఇక్కడ ఒక్కటి చెప్పవలసివస్తున్నది. ఆధ్యాత్మికమైన అనాసక్తియోగంలో గూడా జీవితాన్ని వదలిపెట్టి వేరుగా సాధించిన అనాసక్తి అనాసక్తి కాదు. అది జీవితాన్ని సంకుచితపరుచుకోవటమే. జీవితాన్ని వికసింపజేసుకోవటం కాదు. దానిని జడత్వం అనిగూడ అనవచ్చును. గోరీలో నిద్రిపోతూఉండే శవమూ, ఆ శవాన్నికప్పి కాపాడుతూఉండే గోరీలోనిరాయీ రెండింటి లోనూతటస్థ భావం ఉన్నది. కాని ఆ తటస్థభావాన్ని 'ముక్తావస్థ' అని ఎవ్వరూఅనరు. జ్ఞానము, భక్తి, సేవల ద్వారా తాదాత్మ్యభావాన్ని విజృంభింపజేసుకొని పూర్ణమైన తటస్థతను పొందినప్పుడే పరమనిర్వాణశక్తి నిచ్చే అనాసక్తి ఏర్పడుతుంది.



# 8

## పరస్మైపదికళ - ఆత్మనేపదికళ

కళలోగూడా అప్పుడప్పుడు ఆత్మనేపది, పరస్మైపది అని విభాగం చేయవలసివస్తుంది. తన ఆనందాన్నే దృష్టిలో పెట్టుకొని, తనకొరకై నిర్మించబడిన కళ ఆత్మనేపదికళ. తనకు కలిగిన అనుభూతిని ఇతరులలోగూడా వికసింపజేయడానికీ, తనకు కలిగిన ఆనందాన్ని ఇతరులకుగూడా కలుగజేయడానికీ నిర్మించబడేది పరస్మైపదికళ. ఎక్కువభాగం కళలు ఉభయపదులుగా ఉంటవి. కళవలన మూలహేతువు ఏవిధంగా ఉన్నా "ఉభయోర్వింద తే ఫలం" ఇద్దరకూ ఫలం ఉంటుంది. అందువల్ల కళ వ్యక్తిగతమా లేక సామాజికమా అని ప్రశ్నించుకొని రెంటిలోనూ విరోధభావాన్ని కలుగజేయడానికి ప్రయత్నం చేస్తే అర్థం ఉండదు. తగాదా లేనిచోట— తగాదా ఉన్నట్లుగా— కల్పించడం సంకీర్ణభావాలు గల ఈ యుగ లక్షణం. వ్యక్తి, సంసారహీనుడైతే సామాజికజీవితాన్ని దుర్భరం చేసివేస్తాడు. సమాజమే సంస్కారశూన్యంగా ఉంటే, వ్యక్తి జీవించనే లేడు. మనస్సు, జీవితము రెండూ, సంస్కృతంగా ఉన్నచోట సమిష్టి, వ్యష్టుల మధ్య విరోధభావం రానేరాదు. సంస్కారాల ద్వారా వ్యక్తి జీవితంలోనూ, మానవజాతిలోనూ, ఐక్యతను నిర్మించడమే ఒక కళ. కళ వ్యక్తిగతంగానూ ఉంటుంది; సమాజగతంగానూ ఉంటుంది.

తాటస్థ్యమును గురించీ, దాని పరిణామాన్ని గురించీ ఇక్కడ ఒక ఉదాహరణాన్ని ఇస్తాను. నేను ఒకసారి ఒక

స్నేహితుణ్ణి చూడడానికి అతనిఊరు వెళ్లాను. అక్కడ ఒక పెద్ద తేలు నన్ను కుట్టింది. మందు దొరకలేదు. విషం ఎక్కింది. ఏమి చెయ్యాలి? ఒక ఉపాయం తోచింది. తేలువిషం మనుష్యుని శరీరంలోనికి ఏవిధంగా ఎక్కుతుంది అనే విషయాన్ని తెలుసుకోడానికి భగవంతుడు నాకు మంచి అవకాశాన్ని కలుగజేశాడు అనే భావంతో సూక్ష్మనిరీక్షణం ప్రారంభించాను. విషవ్రభావాన్ని గురించి ఆలోచించడం ప్రారంభించాను. "విషం ఇంతవరకు ఎక్కింది, ఇంతవరకు ఎక్కింది" అనినిరీక్షణ ప్రారంభించేసరికి బాధ సహించగలిగే శక్తి ఏర్పడింది. బాధను సహించగలగడమే కాదు, చివరకు నిద్ర వచ్చింది. సుఖంగా నిద్ర పోయినాను.

ఇంద్రియాసక్తి, విలాసలోలత్వము, అహంకారము ఉన్న చోట తాటస్థ్యము గానీ, తన్మయత్వము గానీ ఉండదు. సుఖమనేది తన్మయత్వమూ కాదు, ఆనందమూ కాదు. ఆనందానుభవం అనాసక్తమైన తన్మయత్వంలోనే లభ్యమవుతుంది. అటువంటి తన్మయత్వాన్నే, తల్లీనతనే ఆనుచనుంటారు. దానిలో అహంకార మమకారాలకు తావుండదు.

కళను గురించి ఇంకొక విధంగా కూడా ఆలోచించవచ్చును. సమాధిస్థితిలో ఉన్నప్పుడు మనుష్యునిలో అహంకార మమకారాలు ఉండవు. ఆస్థితిలో అతనికి కలిగే అనుభవం అపారుషేయం. అవర్ణనీయం. సమాధి స్థితిలో ఉన్నప్పుడు కలిగే అనుభవమూ, సమాధినుండి లేచిన తరువాత తిరిగి మామూలు స్థితిలో కలిగే భేదానుభూతీ ఈ రెంటినుండి కళ ఉత్పన్నం అవుతుంది. సమాధిస్థితినుండి వ్యక్తిత్వం లోనికి

వచ్చిన తరువాత సమాధిస్థితిలో బయట ప్రపంచంతో తనకు సంబంధం ఉండదు గనుక వ్యక్తి బయటిప్రపంచంతో తాను పోగొట్టుకొన్న ఐక్యతాసంబంధాన్ని తిరిగి ఏర్పాటుచేసుకో డానికి కళ ద్వారా ప్రయత్నిస్తాడు. విశ్వాత్మైక్యభావము, సర్వాత్మైక్యభావమే ఆనందము. సమాధిలో క్షణకాలం అనుభవించిన ఆనందాన్ని ఇంద్రియాలకు లభ్యమయ్యేటట్లుగా ప్రకటించడమే నిజమైన కళ; నిజమైన కావ్యము. కనుక పరి శుద్ధమైన కళ హృదయాన్ని సమున్నతంగా చేస్తుంది. విగ్రహ ప్రవృత్తిని నశింపజేస్తుంది. ఉన్నతమైన ఆత్మలను దగ్గరకు చేర్చి సాంఘికసమస్యలను సమన్వయపరుస్తుంది. కళకు ప్రయోజనం ఇదే. ఈ విషయాన్ని గుర్తిస్తూ కళ ఒక ప్రచారసాధనం అన్నా కూడా ఇబ్బంది లేదు. కళలో ప్రచా రానికి తావు ఉండకూడదు అని దెబ్బలాడ వలసిన అవసరం లేదు. ఉత్తమమైన ప్రచారంలోనూ, శుద్ధమైన కళ లోనూ ఏమీ భేదం లేదు. పరస్పైవది కళ అంటే ప్రొపగాండా, ప్రచారం అన్నమాట. కాని ఒక విషయం దృష్టిలో ఉండాలి. ప్రచారం చేయబడే వస్తువు కళావస్తువులాగా ఉత్తమంగా ఉండాలి.



## 9
## ప్రకృతి, కళాదీక్ష

కళ మనుష్యనిర్మితము అనే వారి వాదాన్ని గురించి ప్రారంభంలోనే మనవిచేశాను. పశుపక్ష్యాదులు, లతలు

పూలచెట్లు, చేపలు, నక్షత్రగుల్లలు, మెరుపులు, మేఘాలు అన్నింటిలోనూ సౌందర్య మున్నది. కాని వాటిలో కళ లేదు. మనుష్యుని మనస్సులో సౌందర్యభావన కలిగి, ఆ భావన పార్థివవస్తువుల ద్వారా వ్యక్తం కావడానికి ప్రయత్నం చేసిన ప్పుడు కళ ఉత్పన్నం అవుతుంది. మనుష్యుని కల్పనలవల్ల కలిగిన ప్రసవవేదననుండే కళ జన్మిస్తున్నది. అయితే ఈ సిద్ధాంతాన్ని అంగీకరిస్తే, దీనిలో సంకుచితత్వం ఏర్పడు తున్నది. "మనుష్యుడు సృష్టించిందే కావ్యం. సర్వలోకాలకూ ఈశ్వరుడైనవాడు సృష్టించి మన ఆనందం కొరకు మన ఎదుట పెట్టింది కావ్యం కాదు" అని మనం భేదభావాన్ని ఎందుకు సృష్టించుకోవాలి? మన కల్పనలూ, మనమూ ప్రకృతిదత్తము లైన వస్తువులమే కదా? మనం ప్రకృతిలో ఒక అంశం మాత్రమే. ప్రకృతి సంపూర్ణం. మనకంటే ప్రకృతి వైభవం ఏవిధంగానూ తక్కువ కాదు. తుపాను వచ్చినప్పుడు సముద్రం ఎలా ఉంటుందో ఒకసారి ఊహించండి. సముద్రవతంలో ప్రయాణం చేస్తూ సముద్రం యొక్క రూపాన్ని గురించి ఆలోచించండి.

సముద్రం "మహాభారతం" లాంటి మహాకావ్యంలాగా కనపడుతుంది. దాని విశాలవక్షంలో భావా లన్నీ నాట్యం చేస్తూ, దృష్టిగోచరం అవుతవి. దాని శాంతభావం, దాని రుద్రావతారం, దాని భయంకరాట్టహాసం, దాని ప్రళయార్భకం దనం, దాని గాంభీర్యం, దాని ప్రసన్నభావం అన్నీ సత్యాలే. అన్నీ భావపూర్ణాలే. మహాసాగరంలోనితుపానూ, శాంతి, మెల్ల లరబడిగా వ్యాపించిఉన్న సముద్రపు సుడిగుండాలూ అన్నీ

మనుష్యుని ఇతిహాసాలకంటే దివ్యత్వంలో ఏమీ తక్కువకావు. రామేశ్వరం వెళ్ళి పొడవైన, సన్నని, బాహువులాగా ఉన్న ఆ చివరి భూభాగంలో నిలబడి సముద్రంవైపుకు చూచినపుడు నాకు అదే భావం కలిగింది. అక్కడనుండి జాఫనా పోతూ భారతదేశానికీ, లంకకూ మధ్యనున్న సేతువనే మహాకావ్యాన్ని సందర్శించినపుడు ఆదికవి వాల్మీకి హృదయం నాకు కళ్ళకు కట్టినట్లు కన్పించింది.

కళాకారుని కంటితో చూచినప్పుడు కోట్లకొలది భారతీయులకు తన పాలవంటి స్వచ్ఛమైన జలాన్నిచ్చి ప్రాణదానం చేస్తూ ఉన్న గంగాభవాని దేవతగానూ, భారతమాతగానూ కన్పిస్తుంది. సందేహం లేదు.

ఈ దృశ్యాలన్నిటినీ చూడవలెనంటే మనం అటూ ఇటూ అవి ఉన్నచోట్లకు పోవలసి వస్తుంది. ప్రయాణం చేసి బాధపడవలసి వస్తుంది. కాని పరమపవిత్రమైన ఆకాశంమాత్రం మనం ఎక్కడఉంటే లేక ఎక్కడకుపోతే అక్కడనే హాజరుగా ఉంటుంది. ఆకాశాన్ని పగలు చూడండి, రాత్రి చూడండి, ఉదయం చూడండి, లేక సాయంత్రం చూడండి, జ్యేష్ఠ మాసంలో మధ్యాహ్నం రెండుజాములప్పుడు లేచిన వేడి గాలి దుమారాలలో చూడండి. మహాసముద్రాన్ని బాహుపాశం లోనికి తీసుకొన్నట్లుగా వ్యాప్తమై కన్పిస్తూ ఉండే సమయంలో చూడండి, ఎప్పుడు చూచినా ఎంతో మనోహరంగానూ, ఎంతో హృదయాకర్షకంగానూ ఉంటుంది. వర్షఋతువులో హిమాలయం లాంటి ఎత్తైన మేఘాలు ఆకాశంలో ప్రయాణం చేస్తూ ఉన్నప్పుడు, చిన్న చిన్న పక్షులు, కిలకిలారావాలతో

ఎగురుతూ క్రిందనున్న జనానికి ఆ మేఘాలలో కలిసిపోయినట్లు కన్పిస్తూ ఉన్నప్పుడు, ఆ మేఘసముదాయంయొక్క విన్యాసము ఎంతో లలితంగానూ, ఎంతో భయంకరంగానూ కూడా కన్పిస్తుంది. సూర్యోదయ సమయంలో వెలిమబ్బులన్నీ ఒక చోటికి చేరినప్పుడు తెరవెనక తెరలను చేర్చినట్లూ, ఆ తెరల మధ్య ఒక మహారాజు సుఖాసీనుడై దర్బారుచేస్తూఉన్నట్లూ కన్పిస్తుంది. ఆ దృశ్యాన్ని చూచి కళాకారుడు.

"ప్రాణప్రజానాం ఉదయు త్యేషసూర్యః" అని
ప్రారంభిస్తాడు.
ధ్యేయ స్సదా సవితృమండల మధ్యవర్తీ
నారాయణో సరసిజాసన సన్నివిష్టః
కేయూరవాన్ మకరకుండలవాన్ కిరీటీ
హారీ హిరణ్మయ వపు ర్ధృతశంఖచక్రః"

అని గానంచేసిన సౌరఋషి కళాకారుడు కాదా ?

అనేక దేశాలకు సంబంధించిన అనేకమంది పురాణ కర్తలు నక్షత్రాలనే కావ్యాలనుగురించి అనేకరకాలుగావర్ణించి ఉన్నారు. దేవతలనే కావ్యాలను గురించి మనోహరంగా వర్ణించిన వైదికఋషుల దృష్టి ముందు ఆకాశగోళంలోని అతి ఉజ్జ్వలమైన జ్యోతు లన్నీ తప్పకుండా ఉండే ఉంటవి. జ్యోతిశ్శాస్త్ర విషయంలో ఈ నాడు జరిగిన నూతన పరిశోధనల వలన వస్తుస్థితిని గురించి అభిప్రాయాలూ, భావాలూ మారితే మారవచ్చును. అందువలన ప్రాచీనకావ్యాలూ, ప్రాచీనభావాలూ మనకు కొంత చప్పగా కన్పించవచ్చును.

కాని అసలు వస్తువు లేవనడానికి అవకాశము లేదు. ఈమధ్యనే ఒక జ్యోతిశ్శాస్త్రజ్ఞుడు ఒక కొత్త విషయాన్ని చెప్పాడు. "చంద్రుడు పృథ్వీ చుట్టూ తిరుగుతూ అంతకంతకు పృథ్వీదగ్గరకు వస్తున్నాడు. తనకై ఏర్పడిన హద్దునుగూడా దాటి చంద్రుడు పృథ్వీ దగ్గరకు రావడంతోనే బద్దలై ముక్కలుముక్కలై పోతాడు. ఆ ముక్కలుగూడా వందా రెండువందలూ కాదు. చూర్ణం చూర్ణం అయిపోతాడు. ఆ చూర్ణంలోనుండి బంగారు కంకణంలాంటి ఒక వలయం ఏర్పడుతుంది. శనివలయం లాగానే పృథ్వీకి దగ్గరగా ఆ వలయంగూడా ఏర్పడుతుంది. ఆ వలయం ఆకాశమధ్యంలోనికి వ్యాపించి రాత్రిపూట సూర్య ప్రకాశంచేత పూర్తిగా గానీ, ఒక భాగంగా గానీ ప్రకాశించి నవ్వుతు మందుగుండుసామాను వెలిగించినట్లు ఎంతో అందంగా ఉంటుంది. అలా జరగడానికి ఎంతో కాలం పట్టదు. ముందు 20 లక్షల సంవత్సరాలలో అది సంభవించవచ్చును. కల్పనాలోకంలో 20 లక్షల సంవత్సరాలు ఏమంత పెద్ద సమయం కాదు. ఇంకా ఎంతోమంది ఎన్నో పరిశోధనలుచేసి వారి వారి అభిప్రాయాలను ప్రకటించారు. ఇంకా పరిశోధనలు సాగుతూనే ఉన్నవి. కాని ఈ తత్వంమీద జ్యోతిషశాస్త్రంలో గూడా కావ్యగతసౌందర్యమూ, కళా – అణువు అణువునా వ్యాపించి ఉన్నవి.

ప్రస్తుతం విమానాలద్వారా గూడా నూతనకళను సృష్టించడానికి అవకాశం కలుగుతున్నది. వాల్మీకి కాళి దాసాదులు వారి వారి విమానాలలో కన్యాకుమారినుండి హిమాలయపర్వతం వరకు విహారంచేసే ఉన్నారు. దేశాన్ని

నాలుగువైపులా నాలుగు పుణ్యధామాలను ఏర్పరచి, నాలుగు ధామాలలోనూ పర్యటనం చేయవలె నని ఆదేశించిన మత కర్తలుగూడా కల్పనాకాశంలో విహరించిన మహోత్తమ కళాకారులే. బీహారు, క్వెట్టాలలో కలిగిన భూకంపాన్ని మనం ఇంకా మరచిపోలేదు. ఆనాటి ఆ భయంకరరుద్రరూప సందర్శనంగూడా కళాదీక్షాపరిపోషితమే. కవులూ, కళాకారులూ అలాంటి దృశ్యాలనుచూచి భయపడరు. హృదయం నీరసమై, ఎండిపోయి, శ్రద్ధ అంతరించి స్వార్థము, కపటము, మోసము, అవిశ్వాసము మొదలైనవే మానవధర్మాలుగా మారిననాడు రౌద్రరూపముతో అవతరించ మని వారు భగవంతుని ప్రార్థిస్తారు.*

వేసంగిలో మధ్యాహ్నం రెండుజాములప్పుడు ఆకాశాన్నుండి వర్షించే అగ్నిజ్వాలలను యమధర్మరాజు కుక్కలతో పోల్చాడు ఒక వైదికఋషి. మనుష్యుడు తాను చేతనవంతుడననీ ఏ ప్రకృతిమాత చల్లని ఒడిలో తాను పెరిగి పెద్దవాడైనాడో ఆ ప్రకృతిని జడపదార్థ మని అంటున్నాడు. అంతకంటే మూర్ఖత్వం ఉంటుందా? ప్రకృతి హృదయాన్ని గుర్తించి ప్రాకృతికానుభూతులను అనుభవించే శక్తి మానవుడిలో నశించిపోయింది. మనం అజ్ఞానంవల్ల మనుష్యు డనీ, మనుష్యేతరమనీ భేదభావాన్ని కల్పిస్తున్నాము. అదేవిజ్ఞాన మనుకొంటున్నాము. అజ్ఞానాన్ని విజ్ఞానమనుకొనే మూర్ఖత్వం మనకే చెల్లింది. అదిగాక మనుష్యుడు ఇంకొక తెలివితక్కువగూడా చేస్తు

---

* «తుమిళ్నాద వేశే ఏషా» —రవీంద్రుడు.

న్నాడు. విజ్ఞానానికి, కళకుగూడా భేదాన్ని కల్పిస్తున్నాడు. నీతినీ, మతాన్నీ, విజ్ఞానాన్నీ, సమాజాన్నీ, జీవితాన్నిగూడా కళతో పోలుస్తున్నాడు.



# 10

## కళ, విజ్ఞానం

వెనుకటి కాలంలో విజ్ఞానానికీ కళకూవిరోధం ఉన్నట్లునూ, విజ్ఞానం (సైన్సు) అభివృద్ధి అయినకొలదీ కళాక్షేత్రం సంకుచితం అవుతుందనిన్నీ, విజ్ఞాన సూర్యోదయం కావడంతోనే కళాచంద్రికలు వెలవెల పోతవనిన్నీ చెప్పబడుతూ ఉండేది.

కాని అది నిజంకాదు. కళాక్షేత్రాన్ని వికసింపజేయడానికి విజ్ఞానం ఎంతో అవసరం. కళకుసంబంధించిన కల్పనాశక్తిద్వారానే-విజ్ఞానం అభివృద్ధి పొందగలుగుతున్నది. కేవలం వైజ్ఞానికుడు విజ్ఞానాన్నిమాత్రమే నేర్పగలడు; విజ్ఞానానికి సంబంధించిన పాఠ్యపుస్తకాలను తయారుచేయగలడు; అంతే. విజ్ఞాన పరిశోధనచేస్తూ జ్ఞానాకాశంలో ఉన్నత పథాలలోనికి ఎగిరి- ఇంతవరకూ ఎవరు పోని-లేక పోలేని స్థానాలకు పోయి విహారించే విజ్ఞానశాస్త్రజ్ఞులు అసాధారణమైన కళాకారులే. విజ్ఞానాన్ని ఉపయోగించి మనుష్యజాతియొక్క సుఖాన్నీ ఆరోగ్యాన్నీ, ఆనందించేశక్తినీ వృద్ధిపొందించేవారంతా కళాకారులే.

అయితే కళలాంటి సున్నితమైన వస్తువు తర్కం ఎదుటనే నిలువలేదుగదా! ప్రాణఘాతుకమైన విజ్ఞాన శాస్త్రమనే ఆయుధం ముందు నిలవగలదా అని సందేహం కలగవచ్చును.

కాని ఆవిధంగా సందేహం కలిగిన పక్షంలో మనకు కళ, విజ్ఞానం రెండింటిమీదా శ్రద్ధలేనట్లు విదితమవుతుంది. సున్నితమైన వస్తువులమీదగూడా ప్రయోగాలూ, పరిశోధనలూ జరుగుతునే వున్నవి. కళ ప్రయోగం చేసినంతమాత్రంచేతనే నశించిపోయే వస్తువుకాదు. కళా విజ్ఞానాన్ని, కళాశాస్త్రాన్ని సృష్టించవచ్చును, కాని ఆ సృష్టించడం అవసరమా? అనేది ప్రశ్న. బాహ్యవస్తువులకు విజ్ఞానం అవసరమైనట్లు ఆంతరిక వస్తువులకు అవసరంకాదు. మనుష్యుని మనస్సు, అతని భావనలు, అతని ప్రేమ, అతని ఆకాంక్షలు అన్నింటికీ వేరు వేరుగా శాస్త్రాలు ఏర్పడవచ్చును. నేటివరకూ అనేక శాస్త్రాలు ఏర్పడినవి. కాని కళకు ఆవిధంగా శాస్త్రం ఏర్పడడం అవసరం లేదనుకుంటాను. కళ అన్ని శాస్త్రాలనూ, అన్ని విజ్ఞానాలనూ మించిన వస్తువు. కళాప్రకాశంలోనే అన్ని రకాల విజ్ఞానాలూ ప్రకాశించవలసిఉన్నవి. అందుకు తగిన ప్రయత్నం మనం చేయాలి. కళకు గూడా శాస్త్రాన్ని సృష్టించి, కళా విజ్ఞానం అని పేరుపెడితే కళలోని విశాలరూపం సంకుచితమైపోతుంది. జీవితానికి శాస్త్రాన్ని ఏర్పాటు చేయవలెనని ప్రయత్నించినప్పుడల్లా అదే పరిస్థితి కలిగింది. శాస్త్రం అనేది ఎప్పుడూ ఏకాంగిగా ఉంటుంది. జీవితం - కళ రెండూ సర్వాంగ పూర్ణాలుగా ఉండాలి. అశ్వమేధ యజ్ఞాశ్వాన్ని లాగా వాటిని

ఇష్టం వచ్చినట్లుగా విహరించ నివ్వవలసి ఉంటుంది. జీవితానికీ, జీవితానికి ప్రభువైన అంతరాత్మకూ ద్రోహం చేయనంత సేపూ కళను శాస్త్ర బంధనాలతో బంధించగూడదు.



# 11

## కళా ప్రయోజనం

కళకు ప్రయోజనం ఏమిటి ? అనే విషయాన్ని గురించి చాలా కాలంనుంచి చర్చలు జరుగుతూనే ఉన్నవి. బహుశా అనంతకాలంవరకూ చర్చలు జరుగుతూనే ఉంటవనుకుంటాను. "కావ్యం యశసే అర్థకృతే వ్యవహారవిదే శివేతర క్షతయే" అని కళకు ప్రాచీనాచార్యులు చాలా ఉపయోగాలను చెప్పారు. యశసే, అర్థకృతే అనేవి ప్రస్తుతం అమలులో ఉన్న పెద్ద ప్రయోజనాలు. ప్రసిద్ధకళాకారులు చూస్తూ చూస్తూనే లక్షాధికారు లవుతున్నారు. వారికి ఎన్నో బిరుదులు ప్రసాదింప బడుతున్నవి. సాంఘికంగానూ, రాజదర్బార్లలోనూ, విద్వన్మండలులలోనూ, వారికి అసమానమైన గౌరవ ప్రతిష్ఠలు కలుగుతున్నవి. పరిస్థితులు ఈ విధంగా ఉన్నా కళకు ప్రయోజనం ధన యశః ప్రాప్తులు అంటే ఈకాలంవాళ్ళు అంగీకరించడం లేదు. పూర్వకాలంవాళ్ళు సంగీతంగానీ, వ్యాకరణంగానీ ఏది నేర్చుకొన్నా మోక్షం వస్తుందని విశ్వసించేవాళ్ళు. కాని ఆధునికులు దానిని విశ్వసించరు. వీరు జీవితంలోని

అన్ని సమస్యలనూ పరీక్షించి, పరిష్కరించే శక్తి - జీవితాన్ని అన్ని రంగాలలోనూ వికసింపజేసే శక్తి - కళలో ఉన్న దంటున్నారు. ఆ శక్తి సంగీతంలోనూ, సాహిత్యంలోనూ కూడా ఉన్నదంటున్నారు. కళ స్వతంత్రం, స్వయం సంభూతం, ఒక జీవితదర్శనం అంటున్నారు. పూర్వులు కళ మోక్షసాధనం అంటే; ఈనాటివాళ్ళు కళ ఆత్మానుభవసాధనం అంటున్నారు.

కళకు అనేకమంది అనేకమైన ప్రయోజనాలను చెప్పుతున్నారు.

(1) Art for art's sake కళ కళ కొరకు.

(2) Art for life's sake కళ జీవితంకొరకు.

(3) Art as an escape from life జీవితంలోని వాస్తవిక పరిస్థితి నుండి తప్పుకోడానికి కళ.

(4) Art as an escape into life నీరస వ్యవహారము నుండి తప్పించుకొని జీవితానందంలోనికి ప్రవేశించడానికి కళ.

(5) Art for service sake సేవకొరకు కళ.

(6) Art for self realisation ఆత్మానుభూతి కొరకు కళ.

(7) Art for joy ఆనందము కొరకు కళ.

(8) Art as recreation వినోదానికి కళ.

(9) Art as a creative-necessity సృజన ప్రవృత్తిని తృప్తిపరచుకోవడానికి కళ.

కళ లోకవ్యవహారవిదే (వ్యావహారిక జ్ఞానాభివృద్ధి కొరకు) అన్నవారి మనస్సులో ఏమున్నదో మనకు తెలి

యదు. కావ్యాలూ, నాటకాలూ, పురాణాలూ మొదలైన వానిని చదవడం వల్ల వ్యావహారిక జ్ఞానాభివృద్ధి కలుగుతుంది, చాతుర్యం పెరుగుతుంది — అని మాత్రమే దాని అర్థం కాదు. చర్మచక్షువుల ద్వారానూ, జడబుద్ధి ద్వారాను కూడా ప్రపంచిక వ్యవహారాన్ని జరుపుకోవచ్చును. విజ్ఞానం తాలూకు సాధారణ ప్రయోగాలు చేయబడుతూ ఉండవచ్చును. కాని కళయొక్కగానీ, జీవితం యొక్కగానీ పరమరహస్యాన్ని అర్థం చేసుకోవలెనంటే, ఆవశ్యవంతమైన వ్యావహారిక జ్ఞానాన్ని సంపాదించవలెనంటే, కళాకారుని కళానుయాయమైన అలౌకిక మైన దృష్టి, తెలివి, ప్రతిభ, వస్తువుల అంతరాంతరాళాల లోనికి ప్రవేశించే శక్తి అవసరం. ఇవన్నీ కావ్యశక్తి వల్లనే — కళాత్మక ప్రవృత్తి ద్వారానే — లభ్యమవును, కళాదృష్టి లేనివాడు ప్రపంచిక రహస్యాన్ని తెలుసుకొననే లేడు.

పూర్వకవులూ, దర్శనకారులూ గహనమైనవిషయాలను గూడా చిన్నచిన్న సూత్రాల రూపంలో మనముందు ప్రవేశ పెట్టారు. నేటి పరిస్థితి అది కాదు. వస్తువులో మహాత్మ్యం ఉండదు. ఆడంబరం అపరిమితంగా ఉంటుంది. న్యాయానికి పూర్వకవి "కావ్యం లోకవ్యవహార ఉద్దీపనార్థం" అని చెప్ప వలసినది. కాని "కావ్యం వ్యవహారవిదే" అని మాత్రమే చెప్పాడు.

"కళ జీవితంలోని నీరసమైన వాస్తవిక పరిస్థితినుండి తప్పుకోవడానికి అని చెప్పేవారికి జీవితంలో ఎన్నో కటువైన అనుభవాలు కలిగి ఉండవచ్చును. వారు జీవిత సంగ్రామంలో ఓడిపోయి ఉండవచ్చును. దుఃఖము, దారిద్ర్యము, అన్యా

యము మొదలైన వానివల్ల భయపడిపోయి ఉండవచ్చును. అంతమాత్రం చేతనే మనుష్యుడు జీవిత ప్రవాహంలో ఓడిపోయినట్లు భావించకూడదు. జీవితాంగాలలో ప్రతిదాని నుండీ రస ప్రవాహాలు ప్రవహిస్తూనే ఉంటాయి. అదే జీవిత స్వరూపం. కాని మనుష్యుడు విషయ లాలసకు లోనై అర్థ విహీనమై, నీరసము నైన జీవితాన్ని గడపడం ప్రారంభించినప్పుడు అతని జీవితం పనికిమాలిన దవుతుంది. మనుష్యునికి విశ్రాంతి, సుఖము అనేవి లేకుండాపోతవి. కోరిన ప్రతివస్తువూ వెంటనే దొరకడం ఆరంభిస్తే కొద్దిరోజులకు జీవితం భార స్వరూపం అవుతుంది. వాంఛాతృప్తి జీవితంలోని ఔత్సుక్య భావాన్ని నశింపజేస్తుంది. చివరకు క్లేశం మాత్రం మిగిలిపోతుంది. కాళిదాసు సృష్టించిన దుష్యంతుడు చెప్పినది అక్షరాలా నిజమవుతుంది. అటువంటివారికే Escape from life అవసరం. అది కళలో దొరుకుతుందేమోనని వారు వెదకడం ఆరంభిస్తారు.

అది వారికి కళలో దొరికిందో, లేదో ఇంతవరకూ ప్రమాణం ఏమీ కనపడటంలేదు. ఊడిగ తిండి తినడం, నౌకర్లను అటూ ఇటూ పరుగెత్తించడం, వ్యభిచార ప్రవృత్తిని ప్రకోపింపజేసే సాహిత్యాన్ని చదవడం, నాటకాలు, సినిమాలు చూడడం, ఇవే జీవితం అయిన వారికీ, కళకూ ఏమీ సంబంధం ఉండదు. వారి జీవితంలో "రసమే" ఉండదు. ఉండేది నీరసమే. జీవిత సంగ్రామాన్నుండి తప్పించుకోవడానికి వారు కళాసేవను ప్రారంభించినా, వ్యాకులభావము, విసుగు వారిని వదలిపెట్టవు. ఆ పరిస్థితిలో వారు ఇంకా ఎక్కడకు పారిపోతారు? అందు

వల్ల జీవితద్రోహంనుండి బయట పడి వారు యథార్థ జీవితంలోనికి వస్తారు. నిజమైన కళ అప్పుడు వారికి సహాయం చేస్తుంది. అటువంటి సుకుమారులకు సుకుమారమైన కళా సాధనాలనే చెప్తాను. వారు సంగీతాన్ని విని ఆనందించ డానికి బదులుగా తాము వాయించడం, పాడడం నేర్చుకోవాలి. డ్యాన్సులు చూడడానికి బదులు నృత్యమయమైన వ్యాయామాన్ని చేయడం అలవరచుకోవాలి. ఖరీదు గల టిక్కెట్లను కొని కళా ప్రదర్శనాలను చూడడానికి బదులు తానే చిత్రాలను నిర్మించడం ఆరంభించాలి. పెద్దపెద్ద పుస్తకాలను ఒళ్ళో పెట్టుకొని నిద్రపోవడం మానివేసి, తమ అనుభవాలను పుస్తకబద్ధం చేయడం ప్రారంభించాలి. ఆనాడు కళ Escape into life అవుతుంది. జీవితానికి ద్రోహాన్ని తలపెట్టి జీవన ద్రోహిగా ఉన్నవాణ్ణి కళ ఉద్ధరించలేదు.

నిజమైన కళ ఏవిధంగా మానవుని ఆత్మవికాసానికి తోడుపడుతుందో, అదేవిధంగా జీవదయ, కారుణ్యభావ ప్రేరితమైన సమాజసేవ కూడా మనుష్యుని ఆత్మవికాసానికి తోడుపడుతుంది.

కళ, సేవ ఈ రెంటింటికీ సమన్వయం కలిగిననాడు రెండూ ఎంతో అభివృద్ధిని చెందుతవి. మన దేశస్థులు అన్ని కళలను భక్తికి సాధనరూపాలనుగా ఉపయోగించి సేవా పరాయణాలనుగా తయారుచేశారు. భోగవిలాసాలను దేవాలయాలతో కలిపి తమ నగ్నత్వాన్ని కప్పివేశారు. కళలు సాంఘిక ధర్మానికీ, వ్యక్తిగత సాధనకూ ముఖ్యాంగాలు అయిపోయినవి.

కళాసాధనవల్లనే ఆత్మసాక్షాత్కారం కలుగుతుంది అని చెప్పడానికి సాహసించలేకపోయినా, సాధనకు పూర్వ రంగంలో కళ చాలా ఉపయోగపడుతుంది. కళలో మనో వినోదం ఉండనే ఉండదు. మనోవినోదం అనేది బయటికి కనపడే ప్రయోజనం. అంతమాత్రం చేత అదే కళకు ముఖ్య లక్ష్యం, పరమప్రయోజనం అని ఎవ్వరూ అనరు. Art as a creative necessity - అనగా ప్రతిమనుష్యునిలోనూ ఉండే "ఏకోఽహం బహుస్యామ్" అనే ప్రవృత్తిని తృప్తిపరచడం కోసం హృదయంలోని గూఢాతిగూఢాలైన భావాలకు సాకారరూపాల నివ్వడానికి ప్రేరణ కలిగినప్పుడు మానవుని మనస్సులో కలిగే ప్రయోజనాన్ని గురించి అధికంగా చర్చించ వలసి ఉంటుంది.

ఏవిధంగా కొంతమంది స్వాతంత్ర్యసంపాదనకూ, సంఘ సేవ జేయడానికీ బ్రహ్మచర్య జీవితాన్ని అభిలషిస్తారో, అదేవిధంగా కొంతమంది కళాకారులు తమ సమయాన్నీ, తమ పూర్ణమైన శక్తినీ, కళాసేవలోనే లగ్నం చేయాలని అభిలషిస్తాను. కళాసేవకంటే ఇతరమైన జీవితం వారికి అవసరం లేదు. కొంతమంది తమ పూర్ణమైన శక్తిని కళారూపంలో అభివ్యక్తం చేయువలెనని చూస్తారు. అందుకు ప్రయత్నం చేస్తారు. వారి కళోపాసన ఇష్టము, అయిష్టము, రుచి, అరుచి, అనేవానిమీద ఆధారపడి ఉండదు. నక్షత్రాలు ప్రకాశించడం కమలాలు వికసించడం మానిననాడే వారు కళోపాసనను మాన గలుగుతారు. వారు కళను నిర్మించడం లేదు. కళ తానంతట తానే ప్రస్ఫుటితమవుతున్నది అని చెప్పవలసి

ఉంటుంది. ఒక కుర్రవాడు దోవలో నిలువబడి తన ఆనందంలో విజిల్ వేశాడు. దగ్గర ఉన్న పోలీసు ఆ కుర్రవాణ్ణి "విజిల్ ఎందుకువేశావని గదమాయించాడు. నేను విజిల్ వేయటం లేదే, నేను వేయువలెనని విజిల్ వేయడంలేదు, దానంతట అది మోగుతున్నదేమో నని కుర్రవాడు జవాబు చెప్పాడు. అటువంటికళను అపౌరుషేయమన్నా తప్పులేదంటున్నాను, దానినే Art for art's sake అన్నా ఇబ్బంది లేదంటాను. భోగ విలాసాల కోసం ఉద్దేశింపబడిన కళ కళకొరకు అంటే మనకు ఇబ్బందీ, బాధా కలుగుతుంది ఈనాడు Art for art's sake అనేది Art for market's sake, Art for vulgarity's sake, Art for dissipation's sake అయిపోయింది. అందువల్ల మనం Art for art's sake అనే సూత్రాన్ని అంగీకరించడంలేదు.

ఈనాడు ఈ అడ్వర్టయిజుమెంట్ల యుగంలో ఫ్రూట్ సాల్టు అడ్వర్టయిజుమెంటుకు షేక్స్పియర్ పద్యాలను ఉటంకిస్తున్నారు. పవిత్రమైన వస్తువులను అపవిత్రమైన క్షుద్రవస్తువులకోసం ఉపయోగిస్తున్నారు. ప్రజాసముదాయం దీన్ని ఆపడానికి ప్రయత్నం చేయాలి. ఇటువంటి అడ్వర్టయిజుమెంట్ల ప్రవృత్తివలన సాహిత్యంకంటె, కళ తొందరగా నష్టపడి పోతుంది. అందువలన కళాకారులు, కళారసికులు ఈ విషయం లో ఎక్కువ జాగరూకతను వహించాలి.

వ్యక్తి జీవితంలోను, కుటుంబజీవితంలోను కూడా సంస్కారము, సంయమము, ఆర్యభావాలు లేనినాడు కళాజీవితం ప్రమాదంలో ఉన్నట్లే. కళలోని పరిశుద్ధతను రక్షించడానికైనా కళాకారులు పరిశుద్ధమైన జీవితాన్ని గడపాలి. జీవనశుద్ధి అని

చెప్పి జీవిత సంగ్రామాన్నుండి పారిపోయే వాళ్లను నేను హర్షించను. ఆ సంగ్రామంలో పాల్గొని జయించినవారే వీర పురుషులు కాగలుగుతారు.

Art for Art's sake అనే సూత్రం, నా నిర్వచనం ప్రకారం సరియైనదే అని నా అభిప్రాయం. జీవితం నిష్కామ వృత్తివల్లనే కృతార్థం కాగలుగుతుంది. అదేవిధంగా కళ గూడాను ధనకాంక్ష, కీర్తిలాలస కళకు ప్రయోజనాలు కానినాడు-రాజవర్గాల్లోనికి, పరిశ్రమాలయాల అధిపతుల చేతులలోనికి కళ పోనినాడు-"కళ కళకొరకే" అనే సూత్రాన్ని మనం తప్పకుండా అంగీకరించవలసి ఉంటుంది.. కళద్వారా సదాచారాన్ని పెంపొందింప జేయాలి. కళద్వారా ధర్మ ప్రవృత్తులను ఉద్దీపింపజేయాలి. కళద్వారా సంఘవ్యవస్థలో సహయోగాన్ని, సామర్థ్యాన్ని తీసుకొని రావాలి. కళకు అంతశ్శక్తి ఉండాలి అని అంగీకరించినప్పుడు "కళ కళకొరకు" అంటే తప్పేమీలేదు. కళయొక్క ఆదర్శం మాత్రం ఉత్తమంగా ఉండాలి. "నేను కళారసికుణ్ణి, కళానందాన్ని ఇతర్లకు పంచి పెట్టడమే నా పని. నా జీవితంలో, నేను చేసే పనులలో మీకేమీ ప్రసక్తిలేదు. సదాచారాది బంధనాలు నన్ను బంధింప నేరవు" అని ఏకళాకారుడైనా చెప్పితే చేతులు జోడించి తమరు కళాకారులుకారు, తమరు కళాసృష్టిని చేయలేరు, అని వారికి సక్రమంగా మనం నివేదించవలసిఉంటుంది. ఆదర్శ కళాసృష్టిలో మనుష్యునకు లభించే ఉత్తమమైన ఆనందమే దాని సృష్టికి కారణం గావడం వల్ల కళ కొరకు కళ అనే సూత్రాన్ని అంగీకరించాలి. సర్వోత్తమ మైన ఆనందాన్ని

అనుభవించిననాడు మనుష్యుడు తప్పకుండా సదాచారి అవు తాడు. కళకు ముఖ్యప్రయోజనం బహ్మానందసహోదరమైన కళానందప్రాప్తియే. సదాచారం గౌణంగా లభ్యమయ్యే ఫలం. (By product) మన కెప్పుడూ సూత్రాలతో తగాదా ఉండ కూడదు. పరిణామాన్ని చూచి మనం మంచిచెడ్డలను నిర్ణ యించాలి.

శుద్ధమైన కళవలన జీవితంలోని అన్నిరసాలు మనకు లభ్య మయితే జీవితం పతితం అవుతుందనే భయం ఉండదు. రసం అనేపేరుతో ఇతర వస్తువులను వెతకడం ప్రారంభిస్తే అప్పుడు తగాదా వస్తుంది. రసం అంటే ఏమిటి అనేదిగూడా మనం ఆలోచించవలసి ఉంటుంది. మన ప్రాచీనులు తొమ్మిది రసా లని నిర్వచనం చేశారు. ఈ తొమ్మిది రసాలను గురించి కొత్త విధానముతో—కొత్తదృష్టికోణంతో మనం ఆలోచించ వలసి ఉంటుంది.



## 12

## రసమీమాంస

కళనుగురించి, కళాప్రయోజనాన్ని గురించీ ఆలోచించే టప్పుడు బయటి కళాకృతియొక్క రూపాన్ని గురించేగాక అభ్యంతరికరూపాన్ని గురించిగూడా ఆలోచించ వలసి ఉంటుంది. సంగీతము, సాహిత్యము, కళ ఈ మూడు భావనా ప్రధానా లనీ, మూడింటిలోనూ ఉండే వస్తువు ఒక్కటే నని తేలికగానే తెలిసికోవచ్చును. ఆ వస్తువునే మనం రస

ఉంటాము. సాహిత్యాచార్యులు రసాన్ని గురించి అనేకవిధాలుగా చర్చించారు. సంగీతంలో రాగాన్ని, తాళాన్ని, అనుసరించి రసంకూడా మారుతూ ఉంటుంది. చిత్రకళలో కూడా తొమ్మిదిరసాలనూ చిత్రిస్తారు. రేఖల బలాన్ని, రంగుల సాహచర్యాన్ని బట్టికూడా రసాన్ని వ్యక్తం చేయువచ్చును. రససిద్ధాంతం ఇంకా సంపూర్ణంగా స్థిరీకరింపబడ లేదు. సాహిత్యాచార్యులు ఇంతవరకు స్థిరీకరించిన రససిద్ధాంతాన్ని అంగీకరిస్తూ, దానిని సంపూర్ణం చేయవలసిన బాధ్యత మనమీద ఉన్నది.



## 13

## కళ యొక్క సంపూర్ణస్వరూపము

ఒక్క విషయాన్ని మాత్రం స్పష్టంగా చెప్పదలచుకొన్నాను. సాహసాన్ని, పరాక్రమాన్ని, ఉత్సాహాన్ని చూపించకుండా, ఆపదలను ఎదుర్కోవడంలోనే ఆనందాన్ని అనుభవించకుండా కళను వ్యక్తం చేయడానికి వీలే లేదు. కళావికాసం శాంతిమయవాతావరణం లోనే కలిగినా కళాప్రేరణ మాత్రం సాహసము, శౌర్యము, పరాక్రమాలనుండీ, బలి అయిపోవలె ననే భావననుండీ మాత్రమే ఉద్భూతమవుతుంది. కళాకారునికి కల్పనాకౌశల్యంలో చంద్రుల క్షిపణిలాగా ఎత్తులకు పోయే పరోప్లేన్ సంచాలకుని సాహసం లాంటి సాహసం ఉండాలి.

దివ్యత్వము, పరాక్రమము రెండూ సోదరులలాంటివి.

రావణుడు, దుర్యోధనుడు, జరాసంధుడు, వృత్తాసురుడు, మిల్టన్ సృష్టించిన సైతాను మొదలైన వారందరూ మంచికి శత్రువులైనా వారిలో పరాక్రమము, ప్రచండమైన మహాత్వా కాంక్ష ఉన్నవి. అందువల్లనే వారు కళాకారులనూ, కవులనూ తమ వంకకు ఆకర్షించుకో గలిగారు. సమర్థము, భవ్యము, ఉదాత్తము, వ్యాపకము, గూఢము అయిన వస్తువు స్వాభావికంగానే సుందరంగా గూడా ఉంటుంది. ఇసుకఎడార్ల వర్ణనలూ చిత్రాలూ దానికి తార్కాణం.

దక్షిణభారత దేశంలోని ఎత్తైన దేవాలయాలు, బీజాపుర్ మసీదులు, బ్రహ్మదేశంలోని విశాలమైన బౌద్ధ విగ్రహాలు అందంగా లేకపోయినా కళాపూర్ణాలని చెప్తునే ఉన్నాము. మన కళాకారులు అన్నిచోట్లా కళావిధానాన్ని సిద్ధపరచి అట్టేపెట్టారు. ఏమూల చూచినా లాలిత్యం, లావణ్యం మీకు కనబడుతుంది. అలౌకికము లని చెప్పబడే ఈ కళాకృతులన్నీ భారతీయసంస్కృతికి ప్రతిమూర్తులు. "పిండం లోనిదే బ్రహ్మాండం లోనిది" అనే సామెత ఇక్కడ సంపూర్ణంగా చరితార్థం అవుతుంది.



## 14

## నేటి కళావిహీనమైన జీవితము

నేడు; సామాజిక వికాసంలోని రహస్యాన్ని అర్థం చేసుకొని, శాస్త్రీయవిధానంతో జీవితపథంలో మార్గ దర్శకత్వాన్ని వహిస్తున్నాము అని చెప్పే కొత్తపంథావారు

కొంతమంది బయలుదేరారు. వారు సామ్యవాద సిద్ధాంతం ప్రారంభమైనది మొదలు- కార్ల్ మార్క్స్ సాంఘికజీవితాన్ని అర్థం చేసుకొన్నది మొదలు-అశాస్త్రీయంగా ఉన్న మానవజీవితాన్ని శాస్త్రీయదృక్పథంతో చూడడం ఆరంభమయిందంటున్నారు. అన్ని పంథాలవారూ తమతమ పంథాలను నిర్మించిన ఆచార్యులను సర్వజ్ఞు లని అంటూనే ఉన్నారు. సామ్యవాదులూ అంతే! వారు సంఘం వర్గకలహాలమీద ఆధారపడి ఉన్నదంటారు. ప్రపంచం పుట్టిన నాడిగా వర్గాలు ఏదో రూపంలో ఉన్నట్లుగానే కనబడుతున్నవి. ఇప్పుడూ ఉన్నవి. ఇకముందు ఉంటవి గూడాను. కాని ఈ వర్గాలలో పరస్పరమైన అజ్ఞానభావము, అనాస్థ ఉండవచ్చును. అంతమాత్రంచేతనే సంఘం వర్గకలహం మీదనే ఆధారపడి ఉన్నది అని అనే విషయంలో చాలా అన్వేషణ జరుగవలసి ఉంటుంది. ఆసిద్ధాంతం ఎంతవరకు సత్యమూ ఆలోచించవలసి ఉంటుంది.

మనుష్యుడు కేవలం ధనానికి మాత్రమే ప్రాధాన్యన్నిచ్చి, సంస్కృతిలాంటి వస్తువులను మరచిపోయినప్పుడు వర్గాలూ, వర్గకలహాలూ తప్పనిసరి అవుతవి. అది ఈ నాటి పరిస్థితి. ఈ నాటిపరిస్థితిని ఆధారంగా, ఉదాహరణగా తీసుకొని ప్రాచీనసాహిత్యము, కళ అన్నీ పూంజీవాదాన్ని బలపరచే వనీ బూర్జువావర్గానికి సంబంధించినవనీ, దరిద్రులు, తిండిలేనివాళ్ల విషయంలో ద్రోహం చేసే వనీ అనడం విచిత్రంగా కనబడుతుంది.

రాజ్యశక్తిని చేతులలోనికి తీసుకోవలెనని నడుములు బిగించి పనిచేసేవారికీ, సంస్కృతిలాంటి కోమలములైన వస్తువు

లకూ పొత్తు పొసగదు. కార్యకాలేచ నిష్ఠురాః (పనిచేసే టప్పుడు నిష్ఠురులు). కార్యం కృత్వా పునః సప్రమాః (పని అయిన తరువాత వినమ్రులు) అని ఒక సామెత ఉన్నది. మన సాహిత్యం మీాదా, మన కళ మీాదా సామ్యవాదులు చేసే తిరుగుబాటు మొదటి తరగతికి చెందినది.

ఈ నాటి మనకళ లోకహితాన్ని సంపాదించేది అవునా, కాదా అనేదికూడా ఆలోచించవలసిందే,

సాహిత్యగోష్ఠులు, సంగీతసమావేశాలు దేశమంతా జరిగేరోజుల్లో, విగ్రహాలు, చిత్రకళ, దేవాలయాలల్లోనూ, బౌద్ధ విహారాలల్లోనూ ఎక్కువగా నిర్మించబడే రోజుల్లో, సంగీతాచార్యులు, భక్తులు, గంగ, యమునలాంటి నదీతీరాలల్లో కూర్చొని సంగీతామృతాన్ని దేశమంతా ప్రవహింపజేసే రోజుల్లో, ధనవంతులకూ బీదవాడికీ ఒకేవిధంగా కళానంద ప్రాప్తి కలుగుతూఉండేది. ఉత్సవ సమయాలలోనూ, వివాహ సమయాలలోనూ, జాతిగత భేదభావం ఉండినా ధనవంతుడు, బీదవాడు అనేభావం కన్పడేదికాదు; ఉండేదికాదు. ఆ రోజుల్లో కళానందాన్ని అనుభవించే విషయంలో ఏ విధమైన భేద భావమూ ఉండేది కాదు. ఉత్తమకళాకారులు విరాగులై ఏకాంతంగా కాలం గడిపేవారు. దారిద్ర్యాన్ని హృదయ పూర్వకంగా ఆలింగనం చేసుకునేవారు. ధనవంతుల ధనాన్ని చూసి ఆ సాధువులు ఏమీా లెక్కచేసేవారుకారు. ధనవంతుడు, బీదవాడు అనే భేదభావం లేకుండా శిష్యుల్ని స్వీకరించేవారు.

ఈ నాడుగూడా అదే స్థితి ఉన్నది అనడానికి నేను సాహసించను. ఈనాడు సాహిత్యము, సంగీతము, కళ మూడూ

ధనవంతుల ఆశ్రయంలోనికి పోయినవి. పూర్వం దేవాలయాలలో ఉండే కళాప్రదర్శనాన్ని వారు, వీరు అనకుండా అందరూ చూచి ఆనందించేవారు. కాని ఈ నాడు ఎగ్జిబిషన్లు ఏర్పడడం వల్ల బీదవారికి కళాప్రదర్శనాలను చూసే అవకాశం లేకుండా పోయింది. అథవా ఆ ఎగ్జిబిషన్లలో బీదవారికి ప్రవేశం దొరికినా వారు ఏమీ అర్థం చేసుకోలేకుండా పోతున్నారు. కళను చూచినప్పుడు ఉత్సాహం, సంతోషం, శ్రద్ధ కలగాలి, వాటికి బదులు బీదవారికి కళాప్రదర్శనాలను చూస్తే విషాదం, నిరుత్సాహం కలుగుతున్నది. కళాకారుల్లో కూడా ఈ నాడు బీదవారిని ఆదరించేవారూ, బీదవారి సేవ చేసేవారూ లేరని అంగీకరించక తప్పడం లేదు. ప్రాచీన భారతదేశంలో కూడా ఈ మాదిరి పరిస్థితులే ఉండేవి అనడం మాత్రం సాహసం

ఈ నాడు ప్రస్తుతం మనం లలితకళలనీ, వృత్తి కళలనీ వేరు వేరు విభాగాలను ఏర్పరచి మన తెలివితక్కువతనాన్ని బయట పెడుతున్నాము. ఇప్పుడు కళను సంగ్రహిస్తున్నాము. పూర్వకాలంలో కళామయమైన జీవితాన్నే గడిపేవారం. ఒకసారి ఒక ధనవంతుని ఇంట్లో విందు జరిగింది. మామూలు పాత్రలు బల్లమీదా, భారతీయ శిల్పితనాన్ని వేనోళ్ళ చాటే పాత్రలు అలమారాలోనూ పెట్టిఉన్నవి. అంటే కళ శవంలాగా అలమారాల్లో ఉన్న దన్నమాట. కళయొక్క వికృతస్వరూపం మాత్రం బల్లలమీద ఉన్న పాత్రల రూపంలో మన జీవితంలోనికి జొరబడిపోయిందన్నమాట. ఒకసారి కర్ణాటక ప్రాంతంలో ఒకరి ఇంట్లో ఉండే అవకాశం లభించింది. ఆ యింట్లో వాళ్ళ

రోజూ ఉపయోగించుకొనే ఒకపాత్రను చూచాను. కళ్లు తిరిగిన ట్లయింది. అద్భుతమైన కళ ఆ చెంబుమీద చిత్రితమై ఇంకి పోయి ఉన్నది. దానితో బాటు ఆ కుటుంబం నడవడిలోనూ, మాట్లాడే విధానంలోనూ, వారి జీవితంలోనూ సర్వత్ర సుందర మైన సంస్కారభావం కనిపించింది. కళ వారి జీవితంలో కలిసి పోయిందన్నమాట. ఒకసారి బీదదైన ఒరిస్సా ప్రాంతంలో పర్యటనం చేసే అవకాశం లభించింది. ఒరిస్సా గ్రామంలోని కొత్తకోడళ్ళు మట్టిపాత్రలమీదా, ఇంటిగోడలమీదా రంగు రంగుల చిత్తరువులను వేశారు. ఆ చిత్తరువులను చూచి నప్పుడు నాకు మహదానందం కలిగింది. ఒక మట్టిపాత్రను నాకు ఇవ్వమని అడిగాను. ఒక పెద్ద సంగ్రహాలయంలో ఆ పాత్రను పెట్టించవలెనని నాకోరిక. నవ్వుతూ ఒకటేమిటి, నాలుగు తీసుకొని పొమ్మన్నారు. ఇటువంటిపాత్రలు మా ఇంట్లో చాలా ఉన్నవన్నారు. ప్రతిఇంట్లోనూ మీకు ఇలాంటి పాత్రలు చాలా దొరుకుతవి అన్నారు. కళ వారి జీవితంలో కలసిపోయి ఉన్నదన్నమాట.

వెనుకబడిన ఆ ప్రాంతంలో కూడా కళ దుఃఖాన్ని మరచిపోవడానికి కాదు - దుఃఖాన్ని కప్పిపుచ్చడానికి కాదు- జీవితానందాన్ని వ్యక్తం చేయడానికి అనే నా సిద్ధాంతానికి బలం చేకూరింది. కంచరి ఇత్తడిపాత్రలను తయారుచేస్తు న్నాడు. తలిదండ్రుల దగ్గరనుండి అతడు ఆ కళను నేర్చు కొన్నాడు. అతని ఆ వృత్తిని పోటీపడి కాజేసేవాడు ఎవ్వడూ లేడు. ఎవరికో భయపడి అతడు ఎక్కడకూ పారిపోనక్కరలేదు. ఎవరితోనూ వైరం అతనికి అసలే లేదు. జీవితం సుఖంగా గడచి

పోతూ ఉండడంవల్ల నిర్విచారంగా తాను నిర్మించే పాత్రలద్వారా తన ఆనందాన్ని వ్యక్తపరుస్తాడు. చిన్నగిన్నెను తయారు చేశా డనుకోండి. దానిమీద లతలను చెక్కుతాను. ఆ గిన్నెతో చిన్నపిల్లలు పాలుతాగుతారు. ఆగిన్నెమీద తోక ఎత్తి నిలువ బడిన అందమైన ఆవుబొమ్మను చిత్రిస్తాడు. దానినే కళఅంటారు. కంచరి ఆ విధంగా పాత్రలమీద చిత్రరువులను చిత్రిస్తూ ఉంటాడు. చూస్తూ పిల్లలు ఆడుకొంటూ ఉంటారు. ఆ పరిస్థితిలో లలితకళకూ, వృత్తికళకూ భేదం ఏముంటుంది?

గుజరాత్‌లోని లోకగీతాలను విన్నవారూ, రంగుపని చేసే రంగరీజల సంవాదాలను విన్నవారూ రంగరీజుల కళ వృత్తికళ, లలిత కళ కాదు అని అనలేరు. ఎత్తైన పర్వతశిఖరం మీది దేవాలయదర్శనానికి సాయంత్రం పోవడం షికారుగాక, సాయంత్రం ఏమీ పనిలేకుండా గాలిలో అటు యిటు తిరగడమే షికారు అవుతుందా? స్కూటు అయి, అటుఇటు పనిలోందర మీద తిరిగితే సంస్కారం ఉన్నట్లున్నూ, తన ముద్దుచెల్లెలి కోసం సీతాఫలం కోసి తీసికొనిరావడానికి అన్న నాలుగుమైళ్లు నడిచివెళ్ళితే సంస్కారం లేనట్లు అవుతుందా?

పట్టణాలలోనూ, విదేశాలలోనూ తయారయే వస్తువు లను ఉపయోగించడానికి అలవాటుపడి సరళమైన సాదా జీవితాన్ని మరిచిపోయినాము. సంతోషానికీ, శాంతికీ బదులు ఉత్తేజనం కలుగజేసే వస్తువులకొరకు వెదకడం ఆరంభించాము. ఈ ఉత్తేజనంలో శాంతి ఉన్న దనడం పాలల్లో ఉన్న పుష్టి కలుగజేసే గుణం సారాయిలోగూడా ఉన్న దనడం అవుతుంది. జీవితరసాన్ని మరచిపోయి బయటి వస్తువులద్వారా – బయ

కళద్వారా జీవితాన్ని సుందరంగా చేసుకోడానికి ప్రయత్నం చేస్తున్నాము. భర్త భార్యను ప్రేమించడం మాని అందమైన చీరలను, వెలగల నగలను చేయించిపెట్టినంత మాత్రంచేత ఆమె జీవితానికి శాంతి లభిస్తుందా?

ఈ నాటి మన పట్టణాలను సొసైటీలను చూడండి. మన జీవితానికి అవసరమైన వస్తువులను సమకూర్చే చాకలి, గొల్ల, మంగలి మొదలైన వాళ్ళ ఇళ్లకూ, మన ఇళ్లకూ సంబంధం లేదు. వాళ్ళు మన ఇళ్లకు ఎంతో దూరంలో ఉండి సరియైన నీటి వసతులుగూడా లేక నానాబాధలు పడుతూ ఉన్నారు. వారి దైన్య పరిస్థితిని చూస్తే మనలో ఎంత అధర్మప్రవృత్తి పెంపొందిందో బోధపడుతుంది. మనకుపాలుపోసే గొల్లవాడూ, పేపరు ఇచ్చిపోయే బీదకుర్రవాడూ మనకు తమ ముఖాన్ని చూపించడానికి భయపడుతున్నారు. బీదవాళ్లను దూరంగా ఉంచి మనం మన జీవితానందాన్ని పూరించేసుకొంటున్నాము. మన ఉత్సవాలు పూర్వంలాగా సర్వసాధారణానికి సంబంధించి లేవు. మన సాహిత్యం ప్రస్తుతం ప్రజా సాహిత్యంగా లేదు. ఈ నాడు మన దేశంలోని కోట్లకొలది చదువురానివారు ఎటువంటి సాహిత్యాన్ని వింటున్నారో, ఎటువంటి గీతాలను పాడుతూ ఉన్నారో, ఏవిధంగా ఉత్సవాలను చేస్తూ ఉన్నారో, ఏవిధంగా ధర్మోపదేశాలను వింటూ ఉన్నారో, పరిశీలించి చూస్తే బీదవాళ్లకూ,ధనికులకూ, చదువుకొన్నవారికీ చదువు లేని వారికీ ఈ మధ్య ఎంత అఖాతం ఏర్పడిందో బోధ పడుతుంది. రాజనైతిక విధానంలో సాంప్రదాయక భేదాలూ, జాతిగతమైన అవరోధాలూ పనికిరావటూ, నగరనిర్మాణంలో

సాంప్రదాయకతత్వాన్ని మరచిపోకుండా ఉన్నాము. పూర్వకాలంలో ఆ యీస్మృత్తులను అవలంబించే వారినిబట్టి వారిఇళ్లు, వారి జీవితం ఉంటూ ఉండేవి. ఇప్పుడు జాతు లన్నీ బొంబాయిలోని ఇళ్లలాగు ఒకే మాదిరిగా కళాశూన్యాలై పోయినవి.

నశించిపోయినకళను ఉద్ధరిస్తామని గ్రామాలకు పోయిన వారుగూడా, గ్రామాల్లో పట్టణవాతావరణాన్ని సృష్టించి, కృత్రిమజీవిత విధానాన్ని పెంపొందింప జేస్తున్నారు.

కళయే జీవిత ప్రతిష్ఠ. అది నాశనం అయితే జీవితంలో నుండి ధర్మమూ, సదాచారమూ అన్నీ నశించిపోతవి. సంఘం వర్గయుద్ధాలకు నిలయం అయిపోతుంది.

మన ఉత్సవాలలో అంధవిశ్వాసాలు, అనవసరపు ఖర్చు ఉన్నమాట వాస్తవమే. కాని వాటిద్వారా సాంఘికకళా ప్రియత్వాన్ని మనం ఎక్కువ చేసుకొన్నాము. ఈ నాడు మత గౌరవం తగ్గిపోయింది. అందువల్ల ప్రస్తుతం ఉత్సవాలను రాజకీయంగానూ, సాంఘికంగానూ కలిగే ప్రేరణలవలన నడుపుతూ ఉన్నాము. మన సోషల్ గేదరి గులూ, పరిషత్తులూ వార్షికోత్సవాలూ,అన్నీ మన సాంఘికజీవితం తాలూకు క్రొత్త ఆవిష్కరణాలు. వీనిలో ఎప్పుడు చూచినా ఒక్కేకమం కన పడుతున్నది. నాలుగైదు సమ్మేళనాలను చూస్తే విసుగు పుడుతున్నది. క్రొత్తక్రొత్త వాళ్లు రంగంలోనికి దిగుతూ ఉండడం వల్ల ప్రతిసంవత్సరం సమ్మేళనాలు జరుగుతూనే ఉన్నవి. కాని సమాజంలో కళాదృష్టి, కళాజ్ఞానం ఏర్పడిననాడే సమ్మేళ నాలలోనూ, ఉత్సవాలలోనూ క్రొత్తపద్ధతులు వస్తాయని

ఆధునిక విధానాన్ని అనుసరించే అలంకారశాస్త్రి వ్యర్థంగా కన్పిస్తుంది. భావకవిత్వానికి నక్షత్రాలూ, సోపానాలూ పుష్పదళాలుగా కన్పిస్తవి [illegible] అలాంటివిడి, సామాను ఎలాంటిదైనా, దానికి సంబంధించిన కళా అలాంటిదిగా ఉండాలి.

మన దేశంలో రాజకీయ శాఖల్లో మాత్రమే పాండి త్యాన్ని సంపాదించిన డాక్టర్లు, వకీళ్లు, న్యాయశాస్త్ర వేత్తలు, ఇంజనీర్లు మొదలైన వారు చాలామంది ఉన్నారు. వారందరికీ వారివారి శాస్త్రమే కాని రెండవది తెలియదు. కాని యావత్తు సంస్కృతినీ, సంపూర్ణ జీవితాన్ని అర్థం చేసుకొన్న జీవన శాస్త్రవేత్తలు మనకు లేనేలేరు. సంస్కృతిని గురించి చర్చించే నాయకత్వం లేకపోతే కాని లాభం ఏమిటి? సంస్కృతినీ, జీవితాన్ని అర్థం చేసుకొని సంఘాన్ని ముందుకు నడిపించే జీవనఋషులు మనకు కావాలి. ఈనాడు యూరోపులో మోస్తరుగా మన దేశంలోగూడా సాంఘికజీవితంలో సంస్కార విహీనమైన అరాజకత్వం వ్యాపించిఉన్నది. ఆ అరాజకత్వాన్ని నిర్మూలనంచేసి సువ్యవస్థితమైన విధానాన్ని ఏర్పరిచే ఋషులు కావాలి. ఇది మనకు అర్థం కావడంలేదు. ప్రభుత్వము లేక పోయినా పరవాలేదు. కాని అలాంటి ఋషులు లేనినాడు సాంఘికజీవితం ఛిన్నాభిన్నమై పోతుందనే విషయాన్ని మనం గుర్తించిననాడు గాని జీవనఋషులను సృష్టించుకోలేము. తేనె టీగలు సైతం తమ రాణి చచ్చిపోతే వెంటనే ఇంకో రాణిని వెదకి తెచ్చుకొంటవి. రాజశక్తి నశించిందని తలవంచుతూ సాంఘిక జీవితంలో స్వాతంత్ర్యం అనే పేరుతో అరాజకత్వాన్ని వ్యాపించచ

నిస్తున్నాము. కుటుంబజీవితంలో కట్టుబాటు ఉంటుంది, రాజ తంత్రం ఉండదు. అదేవిధంగా సంఘజీవితంలో కూడా రాజతంత్రం గాక కట్టుబాటు ఉండాలి. వ్యక్తిమోస్తరుగా సంఘంకూడా "మాతృవాన్" "పితృవాన్", "ఆచార్యవాన్" అయివుండాలి. ఆ నాడే సంఘజీవితానికి సామర్థ్యమూ, స్వాస్థ్యమూ రెండూ ఏర్పడతవి. ఆనాడే జీవనకళ పరిపుష్ట మవుతుంది. లలితకళలూ, వృత్తికళలూ, ఒకదానికొకటి సహాయకాలు అవుతవి. ఆ పరిస్థితుల్లో వర్గకలహాలకు అవకాశమే ఉండదు. మన ప్రాచీనసంస్థలు ఆ పరిస్థితుల్లోనే నడుస్తూ ఉండేవి. రాజుకూడా కులగురువు అనే దృష్టితోనే తాను సుఖాన్ని అనుభవిస్తూ రాజ్యపాలన చేసి ప్రజలనుకూడా సుఖపెట్టుతూ ఉండేవాడు. ఈనాటి మనవ్యవహారాలల్లో పాశ్చాత్య విధానం పెచ్చుపెరిగిపోయింది. అధ్యక్షుడు ఉపాధ్యక్షుడు, కోశాధ్యక్షుడు, కార్యదర్శి, కార్యనిర్వాహకవర్గ సభ్యులు లేకుండా మనకు సంఘాలు పనిచేయడమే మానివేసినవి. మన సాంఘిక శాస్త్రంలోనే వివాదాలు రావడంవల్ల సమాజాన్ని ఏకసూత్రంమీద నడిపించవలసి ఉంటుం దనే భావమే ఎవ్వరికీ కలగడం లేదు.

మనం మేల్కొనాలి. మన సాంఘికజీవితంలో ఏ మేమి మార్పులువచ్చినవో, ఒకపట్టీని తయారుచేయించాలి. సమాజం లో పురాతనాదర్శాలు ఎన్ని ఉన్నవి ? వాటిస్థానే కొత్తవి ఎన్ని వచ్చినవి? మారిపోయిన ఈ పరిస్థితుల్లో మనం ఏమిచేయాలి? సాంఘికవ్యవస్థను ఏ రూపంలో నిర్మించుకోవాలి? అనే అన్ని విషయాలను గురించి సాకల్యంగా చర్చించుకోవాలి.

సమాజ శాస్త్రాన్ని గురించి విస్తృతంగా అధ్యయనం చేయాలి. సూక్ష్మాతిసూక్ష్మమైన విషయాలను గురించికూడా ఆలోచించాలి. సామాజిక జీవితాధ్యయనం సంపూర్ణం అయిన తరువాత కళకు జీవితంలో ఉన్న స్థానం ఏమిటో తేలికగా నిర్ణయం అయిపోతుంది. ఈ విషయాలన్నిటినీ అర్థం చేసుకొన్ననాడు అందవిహీనమైన విదేశీవస్తువులతో డ్రాయింగు రూములను నింపడం మానివేసి కళామయమైన వస్తువుల కోసం వెదకగలుగుతారు. పనస కంచర్లు, సాలీలు, కుమ్మర్లు, బంగారం పని చేసే వారుకూడా ఉద్దేశ్య విహీనంగా, కళావిహీనంగా వస్తువులను తయారుచేయడం ఆరంభించారు. చేసేవస్తువులను ప్రాచీనపద్ధతులలో కాగా తయారుచేస్తున్నారు. లేకపోతే ఇతరదేశాలనుండి వచ్చే కేటలాగులను దగ్గర పెట్టుకొని వాటినద్దిగానైనా తయారు చేస్తున్నారు. స్వతంత్రంగా ఆలోచించి కొత్తవిధానాల ప్రకారం కళాసృష్టి చేసే శక్తి తగ్గిపోతున్నది. ధనుర్వేదము, ఆయుర్వేదము, సంగీతము, అశ్వవిద్య, గజవిద్య మొదలైన అన్ని కళలనూ ఎక్కువగా ప్రకాశింపజేసిన బ్రాహ్మణాచార్యులు "వర్ణానాం బ్రాహ్మణో గురుః" అనేదానికి బ్రాహ్మణుకు దక్షిణలను బాగా పుచ్చుకోవచ్చును. చరణ తీర్థాన్నిచ్చి ఆశీర్వాదాల నిచ్చి శ్రాద్ధాలల్లో తుష్టిగా భోజనం చేయవచ్చును అనే సంకుచితార్థాన్ని కలుగజేస్తున్నారు. ఈనాటి చదువుకొన్న వారిలో విశ్వకర్మ అయ్యే యోగ్యత గలవారేరి? భరతాచార్యులు కాదగిన వారేరి? కట్టుదిట్టమైన వర్ణవ్యవస్థనూ, సాంఘిక సేవా విధానాన్నీ నిర్మించ గలిగే జీవనకళాకారులు

బయలుదేరితేనే సమాజం జీవించ గలుగుతుంది. ఇటువంటి వ్యక్తులూ — అటువంటివ్యవస్థా — కావలెననే కోరిక — ఆకలి — సమాజంలో కలిగితేనే కాని ఇలాంటి జీవన కళోపాసకులు ఉత్పన్నం కారు.



# 16

## భవన నిర్మాణకళ

నాటకంలో అనేకమైన సాహిత్యకళలు కలిసినట్లుగా, అజంతా స్తూపాలలో అనేకమైన వాద్యాలు కలిసినట్లుగా భవన నిర్మాణ కళలో కూడా అనేకమైన కళలు కలిసి ఉన్నవి. అందువల్ల జీవితావసరాలనూ, సామాజిక జీవితానందాన్ని, జీవితాన్ని దృష్టిలో పెట్టుకొని భవననిర్మాణ కళను వికసింప చేయవలసి ఉంటుంది. మన అవసరాలనూ, నివాస పద్ధతులనూ అనుసరించి భవనాలను నిర్మించవలసి ఉంటుంది.

పూర్వం మనం ఎవరినిబడితే వారినే అతిథులనుగా స్వీకరించేవాళ్ళం. అయితే మన సంప్రదాయానికి అనుకూలించేవారినే ఇంట్లోకి రానిచ్చేవాళ్ళం. — వాళ్ళను పూజించేవాళ్ళం. మధ్యయూరపులోని గ్రామాలలో కూడా ఇదే విధానం అమలులో ఉండేదని చెప్తారు. ఉత్తర హిందూదేశంలో ఘోషాపద్ధతి ఉన్నచోట అతిథులను గౌరవించే విధానం ఇంకొక విధంగా ఉండేది. కాని ఇప్పటి పరిస్థితులు మారిపోయినవి. అతిథులను మనం పూర్వం లాగా

కూరనిండా మసాలా దినుసులొస్తే చేతికి వచ్చినట్లుగా వేయడం ఆరంభిస్తే కూర రుచి చెడిపోవడమే కాకుండా ఆ కూర తిన్నవాడి ఆరోగ్యంకూడా చెడి ఊరుకుంటుంది. ఇరవయినాలుగుగంటలూ సంగీతమే వింటున్నా, మాటిమాటికి కవిత్వం ప్రారంభించినా తల నొప్పి పుడుతుంది. అందువల్ల కళాభివృద్ధి ఏమాత్రమైనా జరుగదు. బొంబాయిలో ఏ ఇంట్లో చూచినా గ్రామఫోన్లు మొరుగుతూనే ఉంటవి. కాని సంగీతం అంటే కనీసం అభిరుచి అయినా ఉన్నవారు ఒక్కడు కూడా కనపడడు. సంయమనం ఉండాలి. నియతి ఉండాలి. అప్పుడే కళ వికసిస్తుంది. ఈ సమానం మితాన్ని మీరడం ప్రారంభిస్తే నోరు రుచి చెడిపోతుంది. కొద్దిరోజుల్లో రుచి కనుక్కొనే శక్తి కూడా నశిస్తుంది. అతిస్తవమూ ఇతర్లను ప్రశంసిస్తూనో, తాను ప్రశంసింపబడుతూనో ఉండేవానికి ఇతర్లలోని మంచి చెడ్డలను తెలుసుకొనే జ్ఞానం కూడా నశించిపోతుంది. అందువల్ల కళాకారులు ముఖ్యంగా సంయమన్ని అలవాటు చేసుకోవాలి. సంయమనం లేనివాడి జీవితము నిస్సారం అవుతుంది.



## 18

### దుస్తులు - ఆభరణాలు

ఒకసారి బరోడా మహారాజు సయాజీరావుగారిని దేశీయ దుస్తుల్లో, అలంకరించబడిన ఏనుగుమీద మాండవీ వైపుకు పోతూఉంటే చూచాను. ఆ తోవకు రెండువైపులా ఉన్న ఇళ్లూ, బండివాళ్లూ, వాడి దుస్తులూ, బండిలో ఉన్న రాజూ

అందరూ ఒకరిలో ఒకరు కలిసిపోయినట్లు కన్పడ్డారు. ఒకే సాంస్కృతిక వాతావరణంలో వారు ఉన్నట్లుగా కన్పడింది. బడౌదా రాజ్యంలోని ప్రాచీన సైనిక దుస్తుల్నీ, ఈనాటి సైనిక దుస్తుల్నీ చూచే అవకాశం నాకు ఒకసారి లభించింది. ఎంత భేదం!! ఆతురురాలైన సోదరీమణి ఈ రెండు రకాల దుస్తులనూ వేరు వేరుగా ధరించి ఇద్దరు సైనికులు నిలువబడి ఉంటే, సహాయాన్ని అర్థించడానికి ఎవరి దగ్గరకు పోతుంది అనే ప్రశ్న నామనస్సులో కలిగింది. ప్రాచీన దుస్తుల్ని ధరించిన సైనికుడు వీరుడుగా కనపడ్డాడు. అంతేకాక అతని దుస్తుల్లోనూ, అతనిలోనూ వంశపారంపర్యంగా ఉంటూ వస్తున్న స్త్రీదాక్షిణ్యాభావం జీర్ణించి ఉన్నది అనిపించింది. యూరపు దేశస్థుల దుస్తులు వారి దేశంలో బాగానే ఉండ వచ్చును. కాని మనదేశంలోని సైనికుని దుస్తుల్లోని ఆర్య భావన నాకు ఆ దుస్తుల్లో కనపడలేదు. అంతమాత్రంచేత ప్రాచీన వస్తువులంటేనే నాకు అభిమానం అని మాత్రం అనుకోవద్దు. దుస్తుల్లో గూడా ప్రత్యేకత ఉంటుందని చెప్పడమే ఇక్కడ నా ఉద్దేశ్యం. విద్వాంసులు, సేవకులు, త్యాగులు, సాధువులు అందరూ వేరు వేరు విధాలుగా ఉన్న దుస్తుల్ని ధరిస్తారు. అలా ధరించడం అవసరం. వారి దుస్తుల్ని వీరూ, వీరిదుస్తుల్ని వారూ ధరించడం ప్రారంభిస్తే బాగుండదు.

మన దేశంలో దుస్తుల విషయంలోగూడా సంయమం చాలా అవసరం. ప్రస్తుతం వైష్ణవులు, బైరాగులు తిలకాలు ధరించి కాషాయ వస్త్రాలతో బయలుదేరుతున్నారు. పూర్వ

కాలంలో అవన్నీ భక్తిచిహ్నాలుగా ఉండేవి. ఈనాడు మోసం క్రింద పరిణమిస్తున్నవి. జీవికానిర్వాహణార్థం సాధనా లవుతున్నవి. విదేశాలనుండి వచ్చిన యాత్రీకులు అలాంటి వారి ఫోటోలను తీసి ఇతరదేశాలల్లో మనల్ని ఎగతాళిగూడా చేస్తున్నారు.

ఇక ఆభరణాలు - మనం ఆభరణాల పిచ్చితో ముక్కు, చెవులు, పెదిమలుగూడా కుట్టుకొని కూర్చొంటున్నాము. అదంతా అనాగరిక చిహ్నం. ఈ వ్యవహారాన్ని ఇంతటినుండి అయినా మనం మానివేయాలి. ఆభరణ ప్రేమ బానిసత్వ చిహ్నమని నా అభిప్రాయం. పూర్వకాలంలో రాజులు నిజంగా రాజులుగా ఉన్నకాలంలో ఇన్ని ఆభరణాలను ధరించేవారు కారు. రాజత్వచిహ్నంగా రెండుమూడు ఆభరణాలను ధరించి సంతృప్తి పడేవారు. తమ కున్న ఐశ్వర్యభారాన్ని రాజులు తాము మోసేవారు కారు. రాణులచేత మోయించేవారు. ఈనాడు సోదరీమణు లందరూ చదువుకొని, క్రొత్త సంస్కారాలను గ్రహించి సంఘంలో నాయకత్వం వహించ బోతున్నారు. వారందరూ ఈ ఆభరణాల విషయంలో ఎక్కువగా ఆలోచించ వలసి ఉంటుంది.



## 19

### నాటకము - సినిమా

నా జీవితకాలంలో నేను పదినాటకాలు చూసిఉంటాను. బయస్కోపు అనే పేరుతో సినిమాలు అమలులో ఉన్న

రోజుల్లో రెండు మూడు బయస్కోపుల్ని కూడా చూసి ఉంటాను. అంతే. అంతకుమించి నాటకాలనుగానీ, సినిమాలను గానీ నేను చూసిఉండలేదు. * ఈ మాత్రం జ్ఞానంతో వాటిని విమర్శించడం ఎలాగా ? ఈనాడు పత్రికల్లో ఎక్కడచూచినా సినిమా బొమ్మలే కనబడుతున్నవి. బొంబాయిలాంటి పట్టణాలలో ఏ గోడమీద చూచినా సినిమా అడ్వర్టయిజుమెంట్లే. దైనిక పత్రికల్లో సినిమాలను గురించి చాలా విమర్శనలు బయలుదేరుతున్నవి. వాటిని గురించి నే నేమీ వ్రాయదలచుకో లేదు. అడ్వర్టయిజుమెంటు పేపర్లలో ఉండే బొమ్మలను చూచి సినిమాల విషయం కొంత ఆలోచించగలిగాను.

ఒక పాశ్చాత్యవిమర్శకుడు సంస్కృత నాటకాలను గురించి విమర్శిస్తూ - సంస్కృత నాటకాలల్లో, కావ్యాలలో ఉండే తీపిఉంటుంది, నాటకం తీపి కోసంకాదు, నాటకం లో రోమాంచాన్ని కలుగజేసే ఘట్టా లుండాలి, అవి లేనినాడు. నాటకం ఏమిటి ?" అన్నాడు.

ఆ రోమాంచాన్ని (Dramatic Thrill) కలుగజేయడానికి ఈనాటి నాటకాలూ, సినిమాలూ ఏస్థితిలోనికి పోయినవో ఆలోచిస్తే నిజంగా మనకు రోమాంచం కలుగుతుంది. ఈ రోమాంచం కోసం లూటీలనూ, బందిపోటు దొంగతనాలనూ, హత్యలనూ, అపహరణాలనూ, అనేకాన్ని చూపిస్తున్నారు.

---

* ఇది వ్రాసినతరువాత కొంతమంది మిత్రుల ప్రోద్బలంవల్ల ధర్మాత్మ అనే ఫిలింను చూశాను. అది నాకు బాగా నచ్చింది. అయినా సినిమా ఒక అసాధారణవస్తువు అనేభావం నాకు కలగలేదు. సినిమాఅంటే నాకున్న అభిప్రాయం మారలేదు.

ఈ నాటి కొన్ని ఫిల్ములు చాలా బాగా ఉంటున్నవని చాలామంది మిత్రులు చెప్తున్నారు. ఉత్తమమైన సాహిత్యక రచనలను ఆధారంగా తీసుకొని ఉత్తమమైన చిత్రాలను నిర్మిస్తే పుస్తకం చదివిన నాటికంటే చిత్రాన్ని చూచినప్పుడు ఎక్కువ ముగ్ధులం కాగలుగుతాము. నీతిని కూడా ఎక్కువగా గ్రహించగలుగుతాము. ఈనాటి కళాకారుల శక్తివిషయంలో నాకు ఏలాంటి సందేహమూ లేదు. శుద్ధ సాత్త్విక కళావికాసం కోసం పాటుబడేవారి సంగతికాదు నేను చెప్పడం. సమాజంతోటీ, సామాజిక పరిస్థితులతోటీ సంబంధం లేకుండా సమాజం ఏమయిపోయినా తమ కావ్యంలోనే తాము మునిగి ఉండే కళాకారులను గురించిమాత్రమే నేను చెప్తున్నాను. వారి శక్తిని చూస్తే కళ్ళు మిరుమిట్లు గొనిపోతవి. ఆసురీ సంపత్తి తాలూకు మహాత్వము, వైభవముమాత్రము తక్కువదా ? సినిమా, నాటకము రెండూ వెంటనే ప్రేక్షకుని తమ ప్రభావంచేత లోబరచుకొంటవి. అందువల్ల ఎక్కువ జాగరూకత అవసరం. అదిగాక ఇంకొక విషయంకూడా ఉన్నది. బొంబాయిలో గ్రామఫోన్లు మోగుతూనే ఉంటవి. రికార్డులు అన్నీ అరిగిపోయినా – సంగీతం ప్రవాహరూపంలో ప్రవహించినా – ఆ సంగీతాన్ని విన్నవారు నాగరికులు అయినా రని గానీ, ఉదారహృదయు లయినా రని గానీ చెప్పడానికి అవకాశం లేకుండా ఉన్నది. జీవితం నిర్మలమైన గృహస్థాశ్రమం లోనే పుష్పించి, వికసిస్తుంది అని అంగీకరించనంతవరకూ కళ ద్వారా సాంఘికంగా అభివృద్ధి కలగడం అసంభవం.

నాటకాలలోనూ, సినిమాలలోనూ జీవితంలోని రస దాయకాలు, ఆకర్షకాలు అయిన ఘట్టాలను కొంత అతి రంజితంగా చిత్రించడం తప్పనిసరి అవుతుందని నేను అంగీకరిస్తాను. కాని ఆ అతిరంజిత చిత్రణం హద్దుల్ని దాటిపోతే కళ లుప్తమై పోతుంది. మనుష్యుని చిత్తవృత్తి వికలంగానే ఉండిపోతుంది. ఉత్తమకళాసేవనం వల్ల లలితభావాలు అభివృద్ధి కావాలి. స్థాయి యైన సంతోషం కలగాలి. అంతే గాని చిత్తవృత్తులు వికలం కాకూడదు.



## 20

### కళా విస్తృతి

మన దేశంలో చిత్రకళ ఒక విచిత్రమైన రూపాన్ని ధరించింది. పూర్వకాలపు పుస్తకాలలోనూ, దేవాలయాల గోడల మీదనూ భారతీయ చిత్రకళారూపాన్ని వ్యక్తంజేసే అనేక చిత్తరువులు కనబడుతున్నవి. రవివర్మ పశ్చిమ దేశాన్నుండి మన దేశానికి "యథార్థవాది" యైన కళను తెచ్చి ఐరోపీయకళా శాస్త్రాన్నీ, సంప్రదాయాన్నీ మిళితంచేస్తూ మనకు చాలా పౌరాణికచిత్రాలను తయారుచేసి ఇచ్చాడు. హావెల్ బంగాళా దేశానికి వచ్చి చిత్రకళారహస్యాలను వ్యక్తంచేసే ఒక సంప్రదాయాన్ని, ఒక నూతన పంథాను, సృష్టించాడు. అవనీంద్ర ఠాకూర్, ఆనందకుమారస్వామి, భగినీ నివేదిత మొదలైన కళారసికు లంతా కళాభివృద్ధికి తోడ్పడ్డారు. అజంతా

చిత్రాలనుండి నూతనప్రేరణను పొంది అనేకమంది అద్భుతమైన చిత్రకారులు తయారౌతున్నారు. గుజరాత్‌లోని చాలామంది లక్ష్మీపుత్రులు ఈ నూతనకళా సంప్రదాయాన్ని ఆదరించి అభినందించారు. అనుసరించారు. 'రవి శంకర రావల్' ఒక "చిత్రకళాపీఠాన్నే" సృష్టించాడు. భారతీయ చిత్రకళ ఇక అనాధ కాదు. నానాలాల్ మెహతా లాంటి చిత్రకళా ఇతిహాస రచయితలుకూడా బయలుదేరారు. డాక్టరు హరిప్రసాద్, రత్నమణి లాంటి కళాకారులు పురాతన భారతీయసంస్కృతిని తిరిగి మన హృదయపీఠాలలో అధిష్ఠింపజేయడానికి విశ్వప్రయత్నం చేస్తున్నారు. అర్ధేంద్ర కుమార్ గాంగులీ లాంటి కళాకారులు చిత్రకళారహస్యాన్ని విస్పష్టం చేయడం ఆరంభించారు. నందలాల్ బోసులాంటి సమర్థులైన కళాకారులు చిత్రకళయొక్క సర్వతోముఖమైన అనంతశక్తిని వ్యక్తీకరిస్తున్నారు. అందువల్ల మనం ఆత్మరతో మనోవృత్తితో పురాతనమైన దానినే అంటిపెట్టుకొని కూర్చోనక్కర్లేదు. ఈనాడు ప్రతి దేశంలోనూ చిత్రకళలో అంతర్జాతీయతత్వం పెంపొందుతూ ఉన్నది. పరిశ్రమల యుగం కూడా తన జటిలసౌందర్యాన్ని చిత్రకళకు నేర్పుతూనే ఉన్నది. పాశ్చాత్యదేశాలనుండి మనం ప్రేరణను పొందాలి అని నా అభిప్రాయం కాదు. క్యూబిక్ కళ ఈ నాడు సార్వభౌమ స్వరూపాన్ని వహించబోతున్నది. సీతాకోకచిలుక రెక్కలు, మహాసాగరంలోని మత్స్యాలు, వనస్పతుల సృష్టివైచిత్ర్యం, దేశదేశాలలోని పశుపక్షులు, గనుల్లోనుంచి తీసిన రాళ్ళు, మంచుశకలాలు, సముద్రంలోని గవ్వలు, నక్షత్రగుల్లలు, ఆకాశం

లోని ఇంద్రధనుస్సు, మేఘాలు, ఇవన్నీ మనకు రంగులూ, ఆకృతికీ సంబంధించిన నూతనదీక్షను ఇవ్వడం ఆరంభించినవి. అనంతమైన విశ్వసాహిత్యమూ, రసాయన ప్రక్రియల ద్వారా తయారు చేయబడిన కొత్తకొత్త రంగులూ, మన కళ్ళముందు నాట్యం చేస్తున్నవి. ఇంత సామగ్రి, విశాల సాహిత్యమూ మనముందు ఉన్న సమయంలో "నేను మా నాన్న గారి భావిలోనే నీళ్ళు తాగుతాను. స్నానం చేస్తాను" అని సంకుచితంగా అనవలసిన అవసరం లేదు. దాసభావము (Slave Mentality), హీనభావము (Inferiority Complex) ఈ రెండూ ఉన్నంతకాలమూ స్వాభిమానం ఉండడం అవసరమవుతుంది. కాని ఇకనుండి మనలో ఆ భావాలు ఉండనవసరం లేదు. మనం ఆత్మజ్ఞానాన్ని అలవరచుకొంటే, మన సామాజికజీవితంలో భారతీయతత్వం ప్రతిబింబిస్తూ ఉంటే ఇతర దేశాలనుండి మనం ఎన్నింటిని గ్రహించినా, అన్నింటినీ భారతీయవాతావరణం లోనికి మార్చుకొంటాము. జీవితం పరిశుద్ధంగా లేక ఒకరిని అనుకరించడం ప్రారంభిస్తే, విలాస ప్రేమలో మునిగిపోతే, ఆనాడు మనకు పతనం తప్పదు. అన్నింటినీ జీర్ణంచేసుకొనే శక్తిని మనం సంపాదిస్తే అగ్ని లాగా సర్వభక్షకులం కావచ్చును. పరిశుద్ధుడైన వాడు అన్నింటిమీదా ఆధిపత్యాన్ని సంపాదింపగలుగుతాడు. దేశానికీ, సంఘానికీ శ్రేయస్సును సమకూర్చగలుగుతాడు.

లేఖనకళ విషయంలో మనం ఏమీ శ్రద్ధ వహించడం లేదు. ప్రాచీనకాలంలో అన్నింటికన్నా ఈ కళకు ఎక్కువ ఆదరభావం ఉండేది. పెద్దపెద్ద పాదుషాలు కూడా తమ

తీరిక సమయంలో మత గ్రంథాలను సుందరమైన అక్షరాలతో వ్రాసి తమ జీవితనిర్వహణానికి తగినంత ధనాన్ని సంపాదిస్తూ ఉండేవారు. నివృత్తిపరాయణులైన సన్యాసులు మొదలైన వారు కూడా లేఖనకళలో అసాధారణమైన ప్రజ్ఞను చూపిస్తూ ఉండేవారు. ఈనాటికి కూడా మన లిపిలో ఉన్న సౌందర్యమంతా వారు పెట్టిన భిక్షే. అచ్చు, టైపురైటర్లూ రావడంవల్ల ప్రస్తుతం ఈ కళావికాసం అడ్డుపడి పోయింది. యూరపులో మాత్రం అలా జరగలేదు. అక్కడ యంత్ర సహాయం తీసుకోబడ్డా అక్షరాలు సుందరంగా ఉండే విషయం లో ఎక్కువ కృషి జరిగింది. మన దేశంలో ఇంకా జడత్వమే రాజ్యం చేస్తూఉన్నది. "విలియమ్ మారిస్" లాంటివాడు మన దేశంలో జన్మిస్తేనేకాని మనకు ముక్తిలేదు. మన దేశంలో బచ్చూభాయీ రావత్ ఈ విషయంలో విశేషంగా కృషి చేస్తున్నాడు. అయినా ఈ కళను సంపూర్ణంగా వికసింప చేయడానికి మనం చాలా ప్రయత్నం చేయవలసి ఉంటుంది.

మూడవది సంగీతకళ. ఈ కళ ప్రస్తుతం చాలా అభివృద్ధిలోనికి వచ్చింది– అనేకానికంటే ఈ కళాప్రచారం ఎక్కువగా జరిగిం దనడం యుక్తియుక్తంగా ఉంటుం దనుకొంటాను. సంగీతశాస్త్రజ్ఞులు ఈ కళావికాసానికి ఎక్కువగా తోడ్పడాలి. రవీంద్రనాథుడు సంగీతకళాభివృద్ధికిగాను చాలా కృషి చేశాడు. గుజరాత్‌లోని లోక సంగీతం, (జానపద సంగీతం) దక్షిణదేశంలోని కర్ణాటక సంగీతం, బెంగాలులోని మధురసంగీతం, ఉత్తర హిందూదేశంలోని ఆర్య- ఈరానీ సంగీతం, ఇవన్నీ మనకు పైతృకంగా లభించిన నిధులు. హిమా

లయపర్వత ప్రాంతంలో ఇంకొక రకపు సంప్రదాయం ఉన్న దని తెలుస్తున్నది. ఈ సంప్రదాయాల నన్నిటినీ సమన్వయింపజేసి ఒక భారతీయసంగీతాన్ని సృష్టించాలి. అందుకై విశేషమైన కృషి జరగాలి.

ఆ యా రాష్ట్రాలలోని సంగీతం, ఆ యా రాష్ట్రవాసుల పురుషార్థానికి ప్రతిధ్వనిగా బయలుదేరుతుంది. మనం పరాక్రమవంతుల మైతే "త్రింశత్కోటి కంఠ కలకల నినాదం" లోనుండి మధురము, భయంకరము అయిన రెండురకాల సంగీతమూ బయలుదేరుతుంది. లాస్యమూ, తాండవమూ రెండూ మన వేకదా! ఇవి ఒకవస్తువుయొక్క రెండురూపాలు. సంగీతశాస్త్రనిష్ణాతుడైన "బిథోవిన్" తుపాను సంగీతాన్ని సృష్టిస్తే, మనం దైవీసంపత్తును అభివృద్ధిపరచే సంగీతాన్ని సృష్టించలేమా ? అందుకు సాధనా, ధైర్యమూ, సాహసమూ అవసరం.

అన్ని కళలను వికసింపజేసి అన్నిటినీ సమన్వయింపజేయడం చాలా అవసరం. చిత్రకారుని ఏడు రంగులకూ, గాయకుని ఏడు స్వరాలకూ సమన్వయం కలగాలి. ప్రకృతిలోని పళ్ళనూ, పూలనూ, ఆకులనూ, జీవ జంతువులనూ చూసి, వాటి రంగుల్ని ఆధారంగా తీసుకొని కొత్తరంగుల్ని సృష్టించాలి. ఈ పనిని కేవలం థియసాఫికల్ సొసైటీ వారిమీదనే వదలిపెట్టితే లాభం లేదు. కళాకారులు గూడా ప్రయత్నం చేయాలి. ఇంతవరకు సంగీతం ఏకాంతంగానో, చిన్నచిన్న సమావేశాలలోనో పాడబడుతూ ఉండేది. ఇకనుండి లక్షలు, జనం హాజరైన చోట్లలో సంగీతకచ్చేరీలు జరగవలసి ఉన్నవి.

అందువల్ల విరాట్ భావాలను వ్యక్తంచేసే రాగాలనూ, సంగీత పద్ధతులనూ వికసింపజేయవలసి ఉన్నది. అక్షరజ్ఞానమైనా లేని మనవాళ్ళు ఆదరభావంతో పూజాగృహాలలో మత గ్రంథాలను పెట్టి పూజిస్తున్నట్లుగా ఈనాటి నాగరికుల మనుకొనే ధనవంతులు సంగీతానికిగూడా అదేగతిని కలగజేస్తున్నారు. ఇకనుండి భారతదేశంలో నాలుగు - బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణాలతోనూ, ఆరు లేక ఆరివైనఆరు రాగాలతోనూ పని జరగదు. కొత్తకొత్త రాగాలను సృష్టించాలి. సృష్టించే యోగ్యతను సంపాదించాలి. రాగ సమన్వయమూ, నూతన రాగోత్పత్తీ, భారతీయజీవితానికి చాలా అవసరం. కురుపాండవ యుద్ధం, బుద్ధభగవానుని గృహత్యాగం, హరిశ్చంద్రుని సత్యవ్రతపరిపాలనాదీక్షా, సీతాదేవి వనవాస నిర్గమనం, ద్రౌపదీవేణీసంహారం, దమయంతీ స్వయంవరం, దండియాత్ర, హరిజనులకోసం ప్రాణాలను సమర్పించడానికి బాపూజీ ప్రారంభించిన దీక్ష మొదలైన ప్రసంగాలను వ్యక్తీకరించడానికి అవసరమైన ఉదాత్త లలిత రాగాలూ, ఛందస్సులూ నిర్మింపబడాలి.

గుజరాత్ లోని లోకసంగీతం ఇతర ప్రాంతాలలోని గ్రామీణసంగీతంకంటే విశిష్టంగా ఉంటుంది. అందులో అసాధారణమైన భావవ్యంజకత్వం కన్పిస్తున్నది. "మేఘాణీ" లాంటి మహాకవులు తమ మేఘగంభీరకంఠాలతో పాడుతూ ఉన్నప్పుడు గ్రామీణసంగీతంలోని మాధుర్యం బోధపడుతుంది. ప్రజాకావ్యాలు, ప్రజాసంగీతం, ప్రజాసాహిత్యం ద్వారా భారతీయ జనసామాన్యం యొక్క జీవితాన్ని సంస్క-

రించాలి. నాగరికజీవనం, గ్రామీణ జీవనం అనే భేదభావాన్ని రూపుమాపాలి.

శాస్త్రకారులు సంగీతాన్ని, గాత్రము, వాద్యము, నృత్యము అని మూడు విధాలుగా విభజించారు. అపరిశుద్ధమైన జీవితం గడిపే వాళ్ళచేతుల్లో ఉన్నరోజుల్లో శిష్టసమాజం సంగీతాన్ని, కళనూ ఒక విధంగా బహిష్కరించింది. నాటకంలో వేషంవేసిన వాడి ముఖం చూడకూడ దనీ, చూస్తే ప్రాయశ్చిత్తం చేసుకోవలెననీ నిన్నటి మొన్నటిదాకా అనుకుంటూనే ఉండేవారం. నటీమణులు పవిత్రురాళ్ళుగా ఉండడానికి వీలే లేదని మన దురభిప్రాయం. నటి, గణిక అనే శబ్దాలతో వారిని పిలవడమే అందుకు నిదర్శనం. (ఇక్కడ ఒక విషయం చెప్పవలసి ఉన్నది. కళకొరకు కళ అనే సిద్ధాంతాన్ని పేర్పర్చుకొన్నప్పుడు ఎంత జాగ్రత్తగా సంచరించాలో బోధపరుచుకోవాలి) కళ అంటేనే అసహ్యించుకొనే ఆ రోజుల్లో, అందులోనూ నృత్యకళ అంటే శిష్టసమాజం ఎంత అసహ్యించుకొనేదో ఆలోచించుకోవచ్చును. ప్రాచీన కవులు రాధాకృష్ణుల రాసక్రీడల వర్ణన ద్వారా శృంగారానికీ, భోగవిలాసాలకూ ధార్మికమైన ఆచరణను, ముసుగును తగిలించినా, జనసామాన్యంలో నృత్యకళ అంటే ఆదరంగానీ, సద్భావంగానీ కలగలేదు. కాఠియావాడ్‌లోని రబారీ భర్వాడ్, జాతివారు ఈ కళకు కొంత ప్రోత్సాహాన్ని కలుగజేశారు. శ్రీకృష్ణుడు కూడా కాఠియావాడ్ రబారీయే కదా! యూరపు దేశస్థులు నృత్యప్రియులు. ఇంగ్లండు నుండి రష్యావరకూ, ఐర్లెండ్ నుండి ఇటలీ లేక గ్రీసువరకూ అన్నిచోట్లా నృత్యకళ అంటే ఆదరభావం మెండు. మనదేశంలో

కూడా ఇంగ్లీషు విద్యాప్రచారంవల్ల నృత్యకళ అంటే అదరాభిమానాలు పెంపొందుతూ ఉన్నవి. నవరాత్రిఉత్సవాలలో మాత్రమే అమలులో ఉండే గర్బాగీతాలకు నాగరిక జీవితంలో కూడా మహత్వపూర్ణమైన స్థానం లభిస్తున్నది. చిత్రకళనూ, సంగీతకళనూ కూర్చొనిచూపించవచ్చును. నృత్యకళ విషయంలో అట్లాకాదు. దానిలో తాళబద్ధమైన వ్యాయామం గూడా ఉంటుంది. అటువంటి వ్యాయామం వల్ల శరీరంలోని అన్ని నరాలకూ కదలిక కలగడమేగాకుండా, విశ్రాంతి గూడా కలుగుతుంది. నృత్యకళలో అనేక కళల సహకారం గూడా ఉంటుంది. దుస్తులు, ఆభరణాలు, ధూపదీపాలు, సంగీతం, తాళం, హావభావాలు, సాహిత్యం అన్నీ నృత్యకళలో సమ్మిశ్రితమైఉంటవి. మన ప్రాంతం (గుజరాత్)లో గర్బానృత్యము, భర్వాడ్ నృత్యము, ఘుమ్మాస్ నృత్యమే ఇదివరలో ఉండేవి. ఇప్పుడు శాంతినికేతనం ద్వారా మణిపురీనృత్యంగూడా దేశమంతా వ్యాపిస్తున్నది. నృత్యంద్వారా చేసే కసరత్తు సుకుమారులకు గూడా బాగా ఉపయోగిస్తుంది. ఉదయశంకరుడి నృత్యం నేను ఇంకా చూడలేదు. మన దేశంలో వేరువేరు ప్రాంతాలలో వేరువేరు సంప్రదాయాల నృత్యవిధానాలు ఉన్నవి. అన్నిటినీ ఉద్ధరించాలి. ప్రచారంలోనికి తీసుకొని రావాలి. హిందూదేశంలో అటుసేతువునుండి, ఇటుహిమాలయంవరకూ దేశమందంతటా అనేకదేవాలయాలు ఉన్నవి. ప్రతి దేవాలయంలోనూ నృత్యంచేస్తూ ఉండే అప్సరసల విగ్రహాలు చెక్కబడి ఉన్నవి. ఆ విగ్రహాల ఫోటోలను తీసి ఒక ఆల్బమ్ తయారుచేస్తే, ఎన్నో ఉత్తమనృత్యపద్ధతులు, హాస్తముద్రలు మనకు

దొరుకుతవి. ఈ విషయంలో గూడా చాలా ప్రయత్నం చేయాలి. ఒక అహమ్మదాబాదు, బీరమ్‌గామ్‌లోనే మనకు ఎన్నో నమూనాలు దొరుకుతవి. నాట్యకళ, నృత్యకళ రెండూ తోడుతోడుగానే నడుస్తూఉంటవి. సంగీతంలో ధ్వనిచమత్కారమూ ఉంటుంది, భావవ్యంజకత్వమూ ఉంటుంది. అదేవిధంగా నృత్యకళలో గూడా అంగసౌష్ఠవప్రదర్శనమే గాకుండా భావప్రదర్శన శక్తి గూడా ఉంటుంది. నృత్యప్రదర్శనంలోని లావణ్యాన్ని నేను బాల్యంలో (పోర్చుగీసు) గోవాలో చూశాను. కథాకళి నృత్యం వైపుకు కొంతమంది దృష్టి ఆకర్షితమైనది. గోవానృత్యం వైపుకు గూడా మన దృష్టి ప్రసరించాలి. నృత్యకళలో సాంప్రదాయకతత్వంకంటే భావవ్యంజకత్వం ఎక్కువగా ఉంటుందని నా అభిప్రాయం.

మన పూర్వులు నృత్యకళను భక్తికి ఒక అంగంగా అంగీకరించారు. ఈ కళను సాంఘిక రూపంలోనికి మార్చేటప్పుడు, ఉపయోగించేటప్పుడు చాలా ప్రమాదాలను ఎదుర్కొనవలసి వస్తుంది. అందువలన చాలా జాగ్రత్తగా ఉండాలి. వికారాల ప్రాచుర్యంవల్ల ప్రమాదం కలుగుతుం దని కళనే బహిష్కరిస్తూ మనకూడదు. వికారాలకు లోను గాక కళావికాసానికి తోడ్పడాలి.



# 21

## ఉ ప సం హా రం

కళను గురించి చాలా వ్రాశాను. కాని, వ్రాయవలసినది కొన్నది సరిగ్గా వ్రాయగలిగానని ధైర్యంగా మాత్రం చెప్పడం లేదు. నేను కళకూ, కావ్యానికీ సవిధమైన సంబంధాన్ని పాటించలేదని మీరు ఆక్షేపించవచ్చును. ఆ ఆక్షేపణను స్వీకరిస్తూ, అది దోషం కాదు, గుణమే అని మనవి చేస్తున్నాను. ముఖ్యంగా సాహిత్యపరిషత్సభ్యులు, కళ, కావ్యము రెంటిలో ఉన్న సామ్యాన్ని, అసామ్యాన్ని ఎక్కువగా గుర్తించాలి. ప్రకృతికి ఎక్కువ ప్రాధాన్యాన్నిచ్చానని రెండవ ఆక్షేపణ రావచ్చు. కళాకారుడు సృష్టికి ప్రతిసృష్టి చేస్తాడు. అతనిది విశ్వామిత్ర సృష్టి. అయినా సృష్టికర్త బ్రహ్మదేవుడు కళాకారులకు కులగురువనే విషయం మాత్రం మనం మరచిపోగూడదు.

కళను గురించి ఇంత పుస్తకం వ్రాయడం కంటే దేశంలోని భాగాలనీ, పట్టణాలనూ నగరాలనూ, వాటిమీద కట్టబడిన వంతెనలనూ, వృక్షాలనూ, వాటి చాయలనూ, ఆ చాయలలో నెమరువేస్తూ విశ్రాంతి తీసుకొనే పశువులనూ, పింఛం విప్పి నాట్యమాడే నెమళ్ళనూ, సముద్రతీరాలనూ, పర్వతాలమీంచి క్రిందకు దూకే జలప్రపాతాలనూ, గుహాలనూ వర్ణించి ఉంటే బాగా ఉండేదేమో ననుకొంటున్నాను. తీర్థస్థానాలు, దేవాలయాలు, మంటపాలు, మసీదులు, వైష్ణవ శైవదేవాలయాలు ఎంత ప్రసిద్ధాలో, దేశంలోని కళాస్థానాలు, సౌందర్యస్థానాలు కూడా అంత ప్రసిద్ధాలే.

గుజరాత్‌లోని జనాన్ని, వారి స్వభావాన్ని, వారి
దుస్తులనూ, వారి ఆహారవ్యవహారాలనూ, వారి ఉత్సవాలనూ,
యాత్రలనూ, లోకకథలనూ, గీతాలనూ, ధార్మిక సంప్ర
దాయాలనూ, వాటి మర్మాన్ని తెలుసుకొని వాటిలో నిహితమై
ఉన్న కళాబీజాలనూ, వర్ణించగలిగితే ఎంతో ఉపయోగం
ఉంటుందనుకొంటాను. గుజరాత్‌లో ఇరవై సంవత్సరాలు నివ
సించినా గుజరాత్‌లోని అన్నిభాగాలను చూసే అదృష్టం
నాకు సంప్రాప్తం కాలేదు. భవిష్యత్తులో ఎవరో ఒక కళా
కారుడు ఆపనిని పూర్తిచేస్తాడని ఆశిస్తున్నాను. ఆనాడు గుజ
రాత్ ప్రాంతం కొత్త అవతారాన్ని ధరిస్తుంది. భారతీయకళకు
సంబంధించిన ఒక అంగం సంపూర్ణంగా వికసిస్తుంది.

కళకు సంబంధించిన కొన్ని విషయాలను సంకేత
మాత్రంగా చర్చించాను. కళావిభాగాలను ఏర్పాటు చేసుకొని
ఒక్కొక్క విభాగంలో ఒక్కొక్కరు సమర్థులైన కళాకారులు
పని చేసినప్పుడుగాని నిజమైన కళోపాసన జరుగదు. ఇంతవరకు
జరిగింది విఘ్నేశ్వరపూజ మాత్రమే. నేను చర్చించిన విషయా
లన్నీ ఒకే కళయొక్క భిన్నభిన్నమైన అంతర్భాగాలు మాత్రమే.
జీవనకళలో పురుషార్థము, ప్రేమ, నిష్ఠ మొదలైన వృత్తులు
మాత్రమే ఉంటవి. జీవనకళ తాలూకు ఉపాంగాలను గురించి
నప్పుడు ఆ చర్చలోనికి జ్ఞాననిష్ఠ, సత్యపరాయణత్వము, సజ్జ
నత్వము, బుద్ధిప్రాగల్భ్యము, ఉదారత, సమయజ్ఞత, రసజ్ఞత,
ఔచిత్యము, సహానుభూతి, సేవాభావం, త్యాగం, శ్రద్ధ, ఈశ్వర
భక్తి మొదలైన అన్ని గుణాలూ వస్తవి. జీవన కళాదృష్టికీ,
ఈగుణాలకూ సంబంధం ఏమిటని మనం ఆలోచించడం ప్రారం

భి_స్తే కళావివేచనా న్ని వదలి ఆదర్శమనే ఆకాశంలో విహారం చేయవలసి వస్తుంది. పైన చెప్పిన గుణాలను పెంపొందించే దైవీశక్తి వికసింపజేస్తేనే కాని కళావికాసం కలగదని నా దృఢ విశ్వాసం.

ఇంతవరకు బాపూజీ అధ్యక్షతవహించిన అన్ని సంస్థలూ నూతనోత్సాహంతో అద్భుతంగా పనిచేస్తూనే వచ్చినవి. ఈ సంవత్సరం ఈ సాహిత్యపరిషత్తుకు గూడా బాపూజీయే అధ్యక్షత వహించారు. అందువల్ల ఈ సంవత్సరం సాహిత్య రంగంలో గూడా అద్భుతమైన కృషి జరిగి తీరుతుంది. గ్రామాలలోని రైతులకూ, మిల్లులలోని కార్మికులకూ, బ్రాహ్మణాది వర్ణాలవారికీ, దేవాలయాల పూజారులకూ, హరిజనులకూ పూంజీపతులకూ, సామ్యవాదులకూ, స్వదేశసంస్థానాధిపతులకూ, వారిచే పీడింపబడేవారికి అందరకూ ఒకే ప్రవృత్తిద్వారా పరస్పర సహకారాన్ని, సహయోగాన్ని కలిగేటట్లు కళోపాసన ద్వారానే చేయగలుగుతాము. కళోపాసనలో సాంప్రదాయక విభేదా లుండవు. హిందువు లనీ, మహమ్మదీయు లనీ, ఇంకా ఇతరు లనీ భేదం ఉండదు. కళోపాసనలో అందరూ ఏకం కాగలుగుతారు.